# మేషరాశి

(అశ్విని 1,2,3,4 పాదములు, భరణి 1,2,3,4 పాదముల, కృత్తిక 1వ పాదము)

ఆదాయం: 8 వ్యయం: 14 రాజపూజ్యం: 4 అవమానం: 3

ఈ రాశివార్కి గురుడు సంవత్సరాది నుండి, జనవరి 98 సం॥ 18వ తేదీవరకు దశమస్థానమందు రజితమూర్తి. తదాది వత్సరాంతంవరకు ఏకాదశమందు రజితమూర్తి. శని వత్సర మంతయు 12ట తామ్రమూర్తి. ఉగాది నుండి జూన్ 24 వరకు రాహువు 6ట, కేతువు 12ట రజితమూర్తులు. తరువాత వత్సరమంతయు రాహువు 5ట, కేతువు 11ట తామ్రమూర్తులు.

వీరికి దశమమందు గురుడు దోషియే యైననూ, నీచస్థితియందుండుట వలన చాలావరకు యోగకారకుడే. శని ఏల్నాటి శని యగుటచేతను, వక్రము చేతను కొన్ని అనారోగ్యములు ఇబ్బందులు కలిగించును. ఈ సంవత్సరము వీర్కి మిశ్రమ ఫలితములుండును. జూన్‌వరకు రాహువు, జనవరి నుండి గురుడు యోగప్రదులు. శనివ్యయమందు శ్రమ, వృధా వ్యయము, త్రిప్పట, తరచు సంచారములను కల్గించుచుండును.

వీరికి పట్టుదల అధికముగ వుండును. తరచు ప్రయాణములు, కార్య నిమగ్నత, ఏదో పోగొట్టుకొనిన వారివలె చింతన - నల్లని జంతుభీతి యుండును. సంవత్సర పూర్వార్ధమునందు సంతానాది ఆరోగ్య లోపము - సంవత్సర మధ్యమందు సత్కార్యలాభ యత్నసిద్ధి. ఉత్సాహము, యత్న బదిలీలు, భూగృహ మార్పు చేర్పులు కల్గును. సంతానమునకై ప్రత్యేకశ్రద్ధ అవసరము. సంవత్సర మధ్యమందు దశమ నీచ గురుని ప్రభావముచే అన్నదాన ఫలితము, తమ ఘనతలను చాటుకొనుట, దైవ, మంత్రభక్తి-గాని ఆటంకములు కల్గుచుండును. గృహ నిర్మాణాదులు గురించి చాలా నిదానము అవసరము.

విద్యార్థులకు మిశ్రమ ఫలితము. వీరు ప్రక్కవారివలన, స్నేహితుల వలన అపకారమును పొందుదురు. అశ్వినివార్కి గతంకంటే మేలు. గణితము, సైన్సు వృత్తి విద్యార్థులకు పరీక్షాకాలము, దేశేతర (ఆంగ్లాది) భాషా విద్యార్థులకు విశేషకాలము. ఉపాధ్యాయులు ఆకస్మిక బదిలీల నెదుర్కొనవలసి వచ్చును. సంవత్సరాంతమున ప్రమోషన్లు ఆశించవచ్చు. ఇంజనీరు, వైద్యవృత్తుల వార్కి శ్రమకాలము. న్యాయవాదవృత్తి వార్కి, స్వతంత్రవృత్తులవార్కి విశేషకాలము.

వ్యవసాయదారులకు శ్రమ మిగులును. వ్యాపారములో పెట్టుబడులు తగ్గించుట మేలు. మాట నిదానము చాలా ప్రధానము. వ్యవసాయదారులకు నిలువలు కలసి రావు. నూతన వ్యాపారము లాశింపరాదు. తైలము, ధాతు, లోహ వ్యాపారులకు మంచి కాలము. షేర్లు కలసిరావు. కంట్రాక్టు వృత్తులవార్కి వ్యవహార భీతి.

అపరములు, కిరాణా, ఫ్యాన్సీ, వస్త్ర వ్యాపారులకు 4,5,6,9,11,12,3 మాసములు విశేష లాభములు కలసివచ్చును. ధాన్యము, బియ్యం, కలప, మిర్చి యితర వ్యాపారులకు ఈ సంవత్సరం మిశ్రమ ఫలితములు.

మత్స్యపరిశ్రమ, కోళ్ళఫారములు, రైసుమిల్లుల వారు స్వంత పెత్తనములు పెట్టుబడులు తగ్గించి వ్యాపారములు చేయుట మంచిది. యంత్ర వ్యాపారులకు, సినీ పరిశ్రమవారికి 6,9,11,3 నెలలు తప్ప తక్కిన నెలలు బాగుండును. కోర్టు వ్యవహారములు నిలబాటు.

4,5 మాసములందు వృత్తి సామాన్యత, తలకు మించిన భారము. ఆరోగ్యలోపము, ప్రయాణ ఇబ్బందులు. 6,7 మాసములందు స్త్రీ పరాఙ్ముఖత, సుఖముకొరకు తాపత్రయము, ఆత్మీయ ధన లాభము, సంతాన-మనోవాంఛాసిద్ధి, 8,9 మాసములందు శత్రు వ్యవహారవృద్ధి, సత్కార్యవిఘ్నము, లోకాపవాదము-ఉదరసంబంధ అనారోగ్యము, అశాంతి. 10,11 మాసములందు మాటనేర్పుచే కార్యలాభము. కాలినొప్పులు, ఇంద్రియ నిర్వీర్యత, ధన లాభ వ్యయములు - శృంగారాభిలాషణము, సుందర తత్వం. 12,1 మాసములందు సన్మాన గౌరవము. వృత్తి విరమణ, పశువాహనలాభము, సుఖము, చేయు పనులందు బద్ధకము - వ్యాపార లాభము - వస్తుసంగ్రహణము - పితృవర్గ అపబలము-2,3 మాసములందు ధనవ్యయము, ఆరోగ్య వ్యయము, శస్త్రచికిత్స, ఉన్నతుల వలన ఇబ్బందులు-వ్యవహార లాభమునకై కొంతవరకు యత్నసిద్ధి కల్గును.

అశ్విని వార్కి వైఢూర్యము-పగడము, భరణివార్కి వజ్రము-ఇంద్రనీలము, కృత్తిక వారికి కెంపు ధరించుట యోగదాయకములు.

ఈ రాశివారు కుటుంబ శుభకార్య గృహ భూప్రయత్నములకై అత్యంత శ్రద్ధను, ముందు దృష్టిని కల్గి వుండవలెను. మొత్తంమీద నష్టమేమీరాదు. శనివార నియమములు, పగడము ధారణాది రుద్రాభిషేకములు-శివలింగ దర్శనము-దక్షిణామూర్తి, దత్తాత్రేయ, అయ్యప్ప ఆరాధనలు చాలా విశేషమును కల్గించును.

వీర్కి అదృష్టసంఖ్య 9. 1,3,4,9 తేదీలు సంఖ్యలు యోగములు. సంవత్సర ప్రారంభం- మధ్యకాలములందు శుభాదులు కలసి వచ్చును.

స్త్రీలు గురువార నియమములు-గణేశ, విష్ణు ఆరాధనలు చేసిన పుత్రసంతాన, ధన లాభ, కుటుంబ గౌరవ లాభములు, శాంతి కల్గును.

## వృషభరాశి

### (కృత్తిక 2,3,4 పాదములు, రోహిణి 1,2,3,4 పాదములు, మృగశిర 1,2 పాదములు)

ఆదాయం: 2 వ్యయం: 8 రాజపూజ్యం: 7 అవమానం: 3

ఈ రాశివార్కి గురుడు ఉగాది నుండి జన 8 వరకు 9ట రజితమూర్తి. తదాది వత్సర మంతయు 10 ట సువర్ణమూర్తి. శని వత్సర మంతయు 11ట రజితమూర్తి. ఉగాది నుండి జూన్ 24 వరకు రాహువు 5ట కేతువు. 11ట సువర్ణమూర్తులు. తరువాత రాహువు 4ట. కేతువు 10ట రజితమూర్తులు.

ఈ రాశి వార్కి గురుడు 9ట లాభమును, విజయమును, గౌరవమును, దైవ కార్యములును కల్గించును. జూన్ వరకు కుటుంబ సమస్యలు, గౌరవ సమస్యలు, ఉద్యోగ సమస్యలు, వ్యవహార భేదములు కల్గుచున్ననూ, గురుబలముచే నిలకడ కలిగి, నిదానం మీద సమస్యలు పరిష్కారం అగును. మొత్తం మీద ఈ రాశి వార్కి జూన్ నుండి విశేషకాలం అని చెప్పవచ్చును.

వీరిది సుకుమార తత్వము. యంత్ర, తంత్ర, పరమంత్ర అభిలాషణము లుండును. నూతనత్వములు ఆలోచింతురు. కళాప్రియత్వము, బుద్ధికుశలత, సమయస్ఫూర్తి కలిగియుందురు. సంవత్సర ప్రారంభమున అల్ప ధన ప్రాప్తి ఉదరం, కీళ్ళు, మోకాలు- సంబంధమగు ఆరోగ్యలోపములు, శస్త్ర చికిత్సలు, స్త్రీ విరోధము, సంవత్సర మధ్యయందు సంఘగౌరవం, నూతన ఉద్యోగ ప్రాప్తి, పదోన్నతి, సంవత్సరాంతమందు వ్యాపారవృద్ధి, స్థిరాస్తి వృద్ధి కల్గును.

విద్యార్థులు బద్ధకం తగ్గించుకొనవలెను. తద్వార ఉన్నత విద్యలను అభ్యసించుట, కళానైపుణ్యం ప్రదర్శించి ప్రశంసల నొందుట సంభవించును. విద్య గురించి దూర ప్రాంతములకు వెళ్ళలేరు.

వ్యవసాయదార్లకు విశేష కాలము. కాంట్రాక్టర్లకు బహు ఆటంకములు, అనాసక్తత కల్గుచూ ఇబ్బందులు ఎదుర్కొన వలసి వచ్చును. వస్త్రములు, ఫైనాన్స్, సినీ, హార్డ్‌వేర్, తైల వ్యాపారులకు 4,5,6,7,10,12,2 మాసములు కాక, మిగిలిన మాసములు బహు విశేషములు, అపరములు, పుగాకు, ధాన్యము, షేర్లు, మిర్చి వ్యాపారులకు, స్వతంత్రవృత్తుల వారికి, కళాకారులకు, 4,7,8,9,11,1,2, మాసములు కాక, ఇతర మాసములందు వ్యాపారాభివృద్ధి, యత్న కార్యసిద్ధి కల్గును. ఇంజనీర్లు, న్యాయవాదులు, సాంకేతికశాస్త్ర, వైద్య వృత్తులవార్కి 4,5,8,9,10,12,2 మాసములు దుర్వ్యయములు. వర్తక, బంధుమిత్ర, శత్రుత్వములు, వ్యవహార చికాకులు, ప్రయాణములు, ఇబ్బందులు ఎదుర్కొనవలసి వచ్చును. మిగిలిన మాసములు ఉత్సాహకరముగా ఉండును. బహు వృద్ధి కల్గును.

స్పెక్యులేషన్ యోగించదు. షేర్లు కలసి రావు. వ్యాపారస్థులు, నిల్వలు తగ్గించి తాత్కాలిక వ్యాపారములు చేయుట వలన, విశేష లాభము పొందవచ్చును.

4,5 మాసములందు వ్యవసాయ, వ్యాపార, ఉద్యోగ అనుకూలములు, ఆడంబర రీత్యా వ్యయం, స్వల్ప శ్రమ, అశాంతి. 6,7 మాసములందు సంఘగౌరవము, యౌవన భోగం, స్థానచలనం, పరస్త్రీ వ్యామోహం, ఫలితము కొరకు తాపత్రయం,

ఆత్మీయ ధనలాభం. 8,9 మాసములు ఆదాయ ఆరోగ్యములు బాగుండుట. చిరకాల సమస్యల పరిష్కారములు. ప్రతాపములు, యత్న స్థానమార్పులు, స్థిరాస్తుల కొనుగోలు గురించి ప్రయత్నములు సంభవించును. 10,11 మాసములు శత్రు నాశనము, మిత్రులు-ప్రభువుల వలన ధనవ్యయం, మాతృ వర్గ రీత్యా అవరోధములు. భూ-పశు చింతన కలుగును. ప్రయాణములందు జాగ్రత్త అవసరం. కళత్ర, పుత్ర, అనారోగ్యములు సూచించును. అశాంతి, అకాలనిద్ర, అకాల భోజనములు తప్పవు. 12,1 మాసములందు ప్రారంభంలో ఇబ్బంది, తర్వాత ఉత్సాహం, శుభకార్య, దైవ కార్యసిద్ధి. జపతప సమారాధనలు, ఇతరులను బదులు అడుగుట. విదేశఖ్యాతి, వ్యాపార లాభము, స్త్రీ మూలక ధనలాభము. మొత్తంమీద ఈ రాశి వార్కి ఈ మాసములు ప్రత్యేకంగా గుర్తుంచుకో దగినవి. 2,3 మాసములందు ఉదర, కటి, మోకాలు సంబంధవ్యాధులు, దుర్బుద్ధి- అధికారము - సంతానచింత మొ॥గు లక్షణములు కల్గును.

మొత్తంమీద ఈ రాశి వార్కి గత సం॥రం కంటె మేలు కల్గును. గృహ నిర్మాణ, శుభ కార్యాదులు. సం॥ర ఉత్తరార్థమందు ఆచరించుట మంచిది.

కృత్తిక వార్కి కెంపు ధరించుట, సూర్యనమస్కారములు చేయుట మేలు.

రోహిణీ వార్కి ముత్యం లేక మయూర నీలం యోగ్యప్రదం. మృగశిరవార్కి పగడం, పుష్యరాగాభరణం ధరించుట మేలు.

ఈ రాశి వార్కి అదృష్ట సంఖ్య 6. 1,3,5,6,8 తేదీలు, సంఖ్యలు ఆది, సోమ, బుధ, శనివారములు కల్సిన మరింత యోగ్యప్రదముగా ఉండును.

మంగళ, శనివార నియమములు. అంగారక, రాహు, కేతు, శుక్ర గ్రహ జపములు, విష్ణుస్తోత్రం, సుబ్రహ్మణ్య-దుర్గాస్తోత్ర పఠనములు జరుపుటవలన సూచిత శస్త్ర బాధలు, వ్యవహార రుగ్మతలు తగ్గి, ఋణ విమోచన కల్గును.

స్త్రీలు మంగళ, శుక్ర వార నియమములు, దుర్గాభవాని, సుబ్రహ్మణ్య ఆరాధనలు చేయుట వలన గృహమందు ఋణ విమోచనం, సత్సంతాన వృద్ధి, గ్రహశాంతి కల్గును.

## మిధునరాశి

(మృగశిర: 3,4 పాదములు, ఆరుద్ర 1,2,3,4 పాదముల, పునర్వసు 1,2,3 పాదములు)

ఆదాయం 5, వ్యయం 5 — రాజపూజ్యం 3, అవమానం 6

ఈ రాశి వార్కి గురుడు 98 జనవరి 8వ తేదీ వఱకు అష్టమమున సువర్ణమూర్తి. తరువాత వత్సరం అంతయు 9ట లోహమూర్తి. జూన్ 24 వరకు 4ట రాహువు. 10ట కేతువు లోహమూర్తులు తరువాత వత్సరం అంతయు రాహువు 3ట కేతువు 9ట లోహమూర్తులు. సంవత్సరమంతయు శని దశమమున లోహమూర్తి.

ఈ రాశ్కి వార్కి గురుడు సంవత్సర పూర్వార్థమందు బహు పరీక్షకుడు, వ్యవహార చింతనము, చర్మరోగములు, ప్రయాణ అస్థిరత్వము, ఔషధ సేవ, పూర్వాస్థులు వ్యయములకై ఆలోచనలు, నూతన గృహ నిర్మాణ ప్రయత్నములు. సం॥రం ఉత్తరార్థమందు యత్నకార్యసిద్ధి, చేయు వృత్తి యందు మార్పులు, ఆటంకములతో కొంత సామాన్యత, ధర్మకార్య సిద్ధి, గృహలాభం, దాసదాసీ వస్తువాహన లాభములు. క్రమముగా ఆరోగ్యవృద్ధి, సంఘకార్యమునకు ప్రధాన వ్యయము, ప్రతిపనియందు పరీక్ష మొ॥గు లక్షణములుండును. వీరికి అష్టమ గురుడు నీచ దోషి అయిననూ-మూర్తిమంతముచే సువర్ణమూర్తి అగుటవలన ఎంతటి కార్యములైననూ సమయస్ఫూర్తితో చాకచక్యముగా నిర్వర్తించుటలో వీరికి వీరేసాటి. స్థిరాస్థులు వృద్ధి కల్గును. ఆర్థిక, వ్యవహార విషయములు. స్వయం ఆలోచనతో, స్వతంత్ర శక్తితో లాభించును. జనవరి తరువాత పాప, శుభగ్రహముల పరివర్తనల వలన స్వయం విషయములకు మనో ఆటంకములు కలుగు చుండిననూ, వ్యవహార చింతనములు కల్గిననూ, నిదానముతో గౌరవమును - లబ్ధిని పొందుదురు. చిరకాలం నుండి నిలచియున్న భూ,గృహ, వ్యవహార చికాకులు ఒక మార్గమునకు రాగలవు.

విద్యార్థులకు ఉత్సాహమైన కాలము. ఉత్తరార్థము మేలు. ఇంజనీరింగ్, గణితం, స్వభాషేతర విద్యార్థులు, అత్యున్నత శ్రద్ధ వహించినగాని ముందుకు రాలేరు. సైన్స్, ఆంగ్లము, న్యాయవాద విద్యార్థులకు ఉన్నతి కలదు. లెక్చరర్లు, ఉపాధ్యాయులు, బ్యాంకర్లు, న్యాయవాదులు, ఇంజనీర్లకు గతములోని అవమానములు, అనుమానములు తొలగి ఉత్సాహము కల్గును. స్వయం వృత్తులవార్కి పరీక్షాకాలము.

వ్యవసాయదార్లకు, కాంట్రాక్టర్లకు శ్రమ మిగులును. ఫైనాన్స్, యాంత్రిక, జల, మత్స్య వ్యాపారులకు మిశ్రమ ఫలితములు. కోళ్ళ ఫారములు, స్పెక్యులేషన్, రైస్ మిల్లు, వస్త్రములు, దినకృత్య వ్యాపారులకు సంవత్సర ఉత్తరార్థం లాభం కల్గును.

లోహములు, స్టేషనరీ, పేపర్, మిర్చి వ్యాపారులకు 5,6,9,11,12,3 మాసములు కాక, మిగిలిన మాసములు యోగ దాయకములు.

4,5 మాసములందు వృత్తి వ్యాపారులకు పరీక్ష, ఇతర సహకారంతో కార్యసిద్ధి. ధన వ్యయంచే శాంతి, వివాహ, ఉద్యోగ వ్యాపార లాభములు.

6,7 మాసములందు స్త్రీ సౌఖ్యం, మనో ఉల్లాసం, ఒకప్పుడు ప్రయాణ జంతుభీతి, ఔషధసేవ. వృత్తి వ్యాపారములలో మిశ్రమ ఫలితములు.

8,9, మాసములు వ్యవహార జయం. చేయు వృత్తియందు ఉత్సాహ ఆసక్తతలు, గురుబలముచే నూతన కార్యదీక్ష, మంత్రలాభం. 10,11 మాసములందు వ్యవహార ఆటంకములు, అనారోగ్యములు. శిరస్సు, పాదము, మోకాలు-సంబంధ, వాత, పిత్త శ్లేష్మ అనారోగ్యములు, శుభకార్యాదులు నిలబాటు, భూగృహ వ్యవహారములు నిలబాటు దూరదృష్టితో నిలువచేసిన భవిష్యత్తులో విజయం. 12,1 మాసములలో స్త్రీ అపవాదములు. మిత్ర శత్రుత్వములు, శత్రు మిత్రత్వములు. క్రూర మనస్తత్వము, అకారణ కలహములు, స్త్రీ మూలంగా ధనవ్యయం, మితభాషణం మేలు. 2,3 మాసములందు ధర్మబుద్ధి, పట్టుదలతో కార్యనిర్వహణ, లోకగౌరవము గురించి న్యాయ- అన్యాయ విచారణ, సింహ పరాక్రమము వ్యాపార ఉత్సాహము.

మొత్తంమీద ఈ రాశి వారికి జూన్ 4,8,10,11,12,1 మాసములు కాక, మిగిలిన మాసములందు వివాహ, భూగృహ, దైవకార్యసిద్ధి, ఆరోగ్యవృద్ధి కల్గును. నూతన వ్యాపారములు. నూతన కార్యములు, సంవత్సరాంతమున ఆశించవచ్చు.

ఈ రాశివారికి అదృష్ట సంఖ్య 5. 1,3,6,8 సంఖ్యలు, తేదీలు, ఆది, సోమ, గురువారములు యోగ్యప్రదములు. వీరు దోషనివారణకై తరచు రుద్రాభిషేకములు, దత్తాత్రేయ-సూర్య ఆరాధనలు, మాతంగి-లలిత స్తోత్రములు చేయుట చాలా విశేషము. శివలింగ దర్శనము చాలా మంచిది.

మృగశిర వారికి పుష్యరాగాభరణం. ఆర్ద్ర వారికి గోమేధిక, పుష్యరాగాభరణములు, పునర్వసు వారికి కెంపు. నీల పుష్యరాగాభరణములు ధరించుట విశేషము.

స్త్రీలు - గురు, శనివార నియమములు, చంద్రశేఖరాష్టకము, లక్ష్మి, దుర్గాస్తోత్రములు పఠించుట చాలా మంచిది. సంతానాభిలాషులకు - శ్రీకృష్ణ, దత్తాత్రేయ ఆరాధనలు వలన సత్సంతాన, ఆరోగ్య, సౌభాగ్యములు, లక్ష్మీవృద్ధి కల్గును.

## కర్కాటకరాశి

(పునర్వసు 4వ పాదము, పుష్యమి 1,2,3,4 పాదములు, ఆశ్లేష 1,2,3,4 పాదములు)

ఆదాయం 14, వ్యయం 2 — రాజపూజ్యం 6, అవమానం 6

ఈ రాశివారికి గురుడు జనవరి 8 వరకు సప్తమమున లోహమూర్తి. తదాదివత్సరం అంతయు 8ట సువర్ణమూర్తి. శని వత్సరం అంతయు 9ట రజితమూర్తి. జూన్ 24 వరకు రాహువు 3ట. కేతువు 9ట రజితమూర్తులు. తర్వాత వత్సరం అంతయు రాహువు 2ట. కేతువు 8ట తామ్రమూర్తులు.

ఈ రాశి వారికి జూన్ వరకు రాహువు యోగ్యప్రదుడు. తరువాత ధనయోగ కారకుడే అయిననూ తరచూ ధనవ్యయమును సూచించును. గురుడు జనవరి 8 వరకు పరిపూర్ణ యోగకారకుడు. తరువాత అష్టమమందు కష్ట, వ్యయ, శ్రమ ప్రదుడు.

ఈ రాశి వారికి ఉత్సాహము, వివాహ శుభకార్యప్రయత్న సిద్ధి, కీర్తి, ఆరోగ్య సౌఖ్యములు, సుఖ సౌఖ్యములు. ఎంతటి వ్యవహారములైననూ ఉత్సాహక పూర్వకంగా పరిష్కార లాభములు. యత్న, దూర ప్రయాణ ఉద్యోగ భూ, గృహ లాభములు, వ్యవహార వ్యయములు. దైవక్షేత్ర సందర్శనములు, యాంత్రిక, అలంకార, అపూర్వ వస్తు సంగ్రహణం, పతి అనురక్తి, కళాపోషణం, మొ॥గు లక్షణములు కల్గి ఉందురు. ఏ కార్యమునైననూ హుందాగా చేయుట, సాంఘిక సేవలలో విజయములు కల్గుచుండును. కానీ, ఏప్రిల్, మే, మాసములందు ఉదరము, నేత్రము, నడుముసంబంధ అనారోగ్యము, ఉష్ణభారము, మాట నిలకడలేకుండుట. స్వల్ప సంతుష్టి కల్గుచుండును. ఈ మాసములందు మిత భాషణము, స్వల్ప ప్రయాణములు మేలు. ఇతరుల వ్యవహారములో తలదూర్చరాదు. గతంలోని మాతృ, పితృ అనారోగ్యములు చాలా వరకు నివారణ మగును.

విద్యార్థులకు, కుటుంబ కార్యములకంటె విద్యయందు నిమగ్నత అవసరం. గణితం, ఆంగ్లము, న్యాయవాద, విద్యార్థులకు పదోన్నతి, భాషేతర, ఇంజనీరింగ్, సాంకేతిక విద్యార్థులకు పరీక్షాకాలం. ఉపాధ్యాయులకు, యాక్టర్లు-డాక్టర్లకు, స్వయం వృత్తులవార్కి విశేషమైన కాలము. లెక్చరర్లు, బ్యాంకర్లు, ఆర్థికశాఖ, వ్యాపారులకు - ఇతరులవలన, ఉన్నతాధికారులవలన, ఇబ్బందులు కల్గును.

వ్యవసాయదార్లకు, కాంట్రాక్టర్లకు విశేషము. నిల్వలు, జాయింట్లు యోగించును. స్వయం వృత్తుల వార్కి సినీ-లలిత కళలవారికి, గుర్తింపు గల కాలము. అపరములు, మత్స్యములు, కోళ్ళు, కూరలు, వ్యాపారులకు లాభం, స్టేషనరీ, యాంత్రికము.

పుగాకు, కలప, వ్యాపారులకు సం॥ర మధ్యయందు ఒడిదుడుకులు. షేర్లు, వస్త్ర, ఇతరవ్యాపారులకు, 6,7,8,11,1,2 మాసాలు ఆకస్మిక ఒడిదుడుకులు. మిగిలిన మాసములు లాభములు.

4,5 మాసములందు నేత్రం, కంఠం, నడుము, కటి ప్రదేశములందు చికిత్సలు, తలవని తలంపుగా ధనలబ్ధి. రాజకీయ-వ్యాపార లాభములు స్పెక్యులేషన్ కొంతవరకు లాభము. కళాకారులకు గుర్తింపు.

6,7 మాసములందు బహు మనోబలం, సోదర ప్రేమ, కానివ్యతిరేకత, ఋణవిముక్తి. పితృమూలక స్థిరలాభములు గృహ-కళ్యాణరీత్యా ధనవ్యయం. సంఘంలో అన్నీ తెల్సున్న వారివలె నటించుట, కవితా వ్యాసంగం.

8,9 మాసములందు బంధుమిత్రవైరము, అసుఖము, జీర్ణరోగశమనము, స్వల్పమనస్తాపము. భూ-గృహ వివాదములు. సుఖంకొరకు తాపత్రయం. అసంతృప్తి. కాని గౌరవము.

10,11 మాసాలలో విదేశవాస నిర్ణయం. ఒంటరి జీవితాభిలాషణము, ప్రారంభమున ధననష్టం. తదుపరి లాభము. ప్రదావ సంతానరీత్యా అనారోగ్యము, ఉదర రోగాది అనారోగ్యములు.

12,1 మాసములందు పరవాంఛ, స్వయం కృతముచే ధనవ్యయం. వితండ వాదనం, వ్యవహార పరిష్కారముల గురించి ఆత్రుత. శస్త్ర, బాధ, అపవాదములు.

2,3 మాసములందు భక్తి, న్యాయవర్తన, మిత్ర శత్రుత్వములు, కార్యవిఘ్నములు, ఉద్యమక్రియాశీలత, స్థానచలన చింత, భూ-గృహ నిర్మాణముల గురించి విశేష కృషి కల్గి నిలబాటు.

మొత్తంమీద ఈ రాశి వారికి సంవత్సర మధ్య యందు వివాహ శుభకార్య ఆచరణ, యత్న బదలీలు, అభీష్టసిద్ధి, దాంపత్యసౌఖ్యము కల్గును.

పునర్వసు, పుష్యమి వారికి నీల పుష్యరాగాభరణము, వజ్రం-ఆశ్రేష వారికి పచ్చ, కెంపు విశేషయోగము.

గ్రహదోషనివారణకై నవగ్రహ జపారాధనములు. విష్ణుస్తోత్ర పారాయణం, లక్ష్మీగణపతి- రుద్రాభిషేకము, సోమ, గురువార నియమములు విశేష ఫలితములిచ్చును.

ఈ రాశి వారికి అదృష్టసంఖ్య 2. 1,3,4,9 తేదీలు. సంఖ్యలు, ఆది, మంగళ, శుక్రవారములు అత్యంత యోగ దాయకము.

స్త్రీలు ఆంజనేయ, సాయి, దుర్గాస్తోత్రములు - గురు, శుక్రవారనియమములు చేసిన ఆరోగ్యవృద్ధి, సత్సంతాన సౌఖ్యం కల్గును.

## సింహరాశి

### (మఖ 1,2,3,4 పాదములు, పుబ్బ 1,2,3,4 పాదములు, ఉత్తర 1వ పాదము)

ఆదాయం 2, వ్యయం 14 రాజపూజ్యం 2, అవమానం 2

ఈ రాశి వారికి గురుడు 98 జనవరి 8 వరకు 6ట సువర్ణమూర్తి. తదుపరి సంవత్సరమంతయు 7ట తామ్రమూర్తి. శని వత్సరమంతయు 8ట సువర్ణమూర్తి. జూన్ 24 వరకు రాహువు 2ట కేతువు 8 ట తామ్రమూర్తులు. తర్వాత రాహువు 1ట (జన్మమందు) కేతువు 7ట సువర్ణమూర్తులు.

ఈ రాశి వారికి గురుబలము బాగున్నది. నైసర్గిక శుభగ్రహము శత్రు స్థాన సంచారం వలనా ఆధిపత్యం చేతనూ మిశ్రమ ఫలితములు ఇచ్చువాడైననూ. మూర్తిమంతము చేత డిశెంబరు వరకూ అనేక మానసిక-ఆర్థిక అస్థిమిత, చికాకులూ కల్గించు వాడైననూ, లేకితనం కల్గిన వాడైననూ, పట్టుదల, ఉత్సాహములను తగ్గించువాడైననూ. ఏవిధంగానూ లోటు రానీయక ధైర్యముతో ముందుకు నడిపించును. వీరు ప్రతివిషయమూ నిర్మొగమాటముగానూ తీవ్రముగానూ మాట్లాడుచుండుటచే. తరచు తగవులపాలగుచుందురు. కొన్ని సమయములందు ధనవ్యయం, మాటనిదానం. జాగ్రత్తలు అవసరం. రాహువు బలముచే ఏదో రకంగా ఇతరుల సొమ్ము చేతికి అందిననూ వ్యయ సూచనలు ఉన్నవి. అష్టమ శని ఆరోగ్య, మానసిక, వ్యవహార ప్రాణభీతి మున్నగు ఫలితములు సూచించిననూ, స్థిరాస్తి మరియు వ్యవహారముల వ్యయములను సూచించిననూ దైవకార్యములచేతనూ-ధనవ్యయంచేతనూ అన్నింటినీ పొంది సాధించుకోగలరు. నిర్మాణా త్మక, యాంత్రిక, వ్యాపార సంస్థలందు, నూతనత్వము ఏర్పరచుకొందురు. తరచూ రుద్ర పారాయణ, అభిషేకములు, శనీశ్వరుడికి తైలాభిషేకములు. నవగ్రహ జపశాంతులు వీరిని కష్టములనుండి కడతేర్చును.

4,5,9,10,11 మాసములుగాక, మిగిలిన మాసములు యోగ ప్రదములు. ఆస్తి కొనుగోలు, వివాహ శుభకార్యములు విరావించి దూరదృష్టితో నిలుపుదల చేయుట మేలు. రాబోవు శ్రీబహుధాన్యనామ సంవత్సరములలో వీరి కష్టములు. కడతేరి సుగమమైన జీవితమును గడిపెదరు.

విద్యార్థులకు సెప్టెంబర్ ఛాన్స్ చూడవల్సి వచ్చును. అధికారులకు స్థానచలన చింత. ఉన్నతాధికార ఆకస్మిక తనిఖీ ఎదుర్కోవల్సి వచ్చును. స్వయం వృత్తులవారికి వ్యాపారులకు శ్రమకు తగ్గ గుర్తింపు భవిష్యత్‌లో కల్గును. ఇంజనీరింగ్, వైద్య, న్యాయవాద వృత్తులవారికి మిశ్రమకాలం. యాంత్రిక, తైల, మిర్చి, కలప, పుగాకు, అపరముల వ్యాపారులకు, అధిక శ్రమతో వ్యాపారం అభివృద్ధి చెందును. రైస్‌మిల్లర్లకు, వస్త్ర, ఫైనాన్స్ వ్యాపారులకు 6,7,9,10 మాసములు విశేషములు.

వ్యవసాయదార్లకు, కాంట్రాక్టర్లకు పెట్టుబడులు తగ్గించుట మంచిది. నిల్వదార్లకు, జాయింట్ దార్లకు, కాంట్రాక్టర్లకు స్పెక్యులేషన్ యోగించదు.

4,5 మాసములందు వృత్తి వ్యాపారాలలో చిక్కులు, శస్త్రచికిత్సలు, దుర్వార్తా శ్రవణం, స్థానచలనం, అశాంతి, మనో వ్యాకులత, ధనవ్యయం.

6,7 మాసాలలో అల్పధనప్రాప్తి, దుర్వ్యయం, మనో ఆనందం, పుణ్యదాన కర్మాసక్తత, తాత్కాలిక కోపం, భోగం.

8,9 మాసాలలో బాహుబలము, వ్యవహార జయం, మేనమామవర్గరీత్యా అపకారము, కుటిలబుద్ధి, పరాపేక్ష.

10,11 మాసములందు సంఘగౌరవము, పరులచే ఈర్ష్య, ఓర్వలేనితనం. మృష్టాన్నభోజనం. సంతానప్రాప్తి. యత్నసిద్ధి.

12,1 మాసములయందు శత్రువృద్ధి. సంపన్న కార్యభంగం, లోకాపవాదములు, శుభ నిశ్చయ సూచనలు కల్గి నిలబాటు, చర్మరోగములు, గుల్మ రోగములు.

2,3 మాసములలో సౌందర్య-అలంకార లాభములు. ఉత్తమ భోజన శయనములు, బంధుమిత్ర అనురాగములు. శరీర రూప సౌందర్యములు, శుభనిశ్చయములు.

మొత్తంమీద ఈ రాశివారికి సంవత్సరమంతయూ మిశ్రమ కాలము. నూతన వ్యవహార లావాదేవీలు సూచించుటచే బహునిదానం అవసరం. విశేష కృషిచే భవిష్యత్ యందు తరగని ఆస్తి సంపాదనకు నాంది.

మఖ వారికి వైఢూర్యం, పగడం; పుబ్బ వారికి వజ్రం, నీలం, ఉత్తరవారికి కెంపు, పగడం, సూర్యోపాసనలు మేలు.

ఈ రాశి వారికి అదృష్ట సంఖ్య 1. 2, 4, 5, 9, తేదీలు. సంఖ్యలు, ఆది, మంగళ, శుక్రవారములు యోగదాయకము.

సంపూర్ణ నవగ్రహారాధనలు, సుందరకాండ పారాయణం, సూర్యోపాసన. శని, రుద్రాభిషేకములు. అత్యంత యోగ దాయకములు.

స్త్రీలు మంగళ, శుక్ర వారములు - పగడం ధారణ, లక్ష్మి, రాజరాజేశ్వరి స్తుతులు చేయుటవలన ఋణ విముక్తి, ఆరోగ్యవృద్ధి కల్గును.

## కన్యారాశి

(ఉత్తర 2,3,4 పాదములు, హస్త 1,2,3,4 పాదములు, చిత్త 1,2 పాదములు)

ఆదాయం 5, వ్యయం 5 | రాజపూజ్యం 5, అవమానం 2

ఈ రాశివారికి గురుడు 98 జనవరి 8 వరకూ 5ట తామ్రమూర్తి. తదాది వత్సరాంతం వరకూ 6ట రజితమూర్తి. శని వత్సరమంతయు 7ట రజితమూర్తి; జూన్ 24 వరకూ రాహువు 1ట (జన్మమందు) కేతువు 7ట రజితమూర్తులు. తరువాత వత్సరమంతయు రాహువు 12ట, కేతువు 6ట రజితమూర్తులు.

ఈ సంవత్సరము జనవరి 8 వరకూ గురుడు 5 వ స్థానమందు సంపద కారకుడు. చాలావరకూ ఉత్సాహమును, ఆరోగ్యమును, వృద్ధిని కల్గించును. తరువాత షష్ఠ గురుడు పాపి. వత్సరమంతయు శని పాపి. రాహుకేతువులు జూన్ తరువాత యోగప్రదులు.

తరచు వ్యాపార ఉద్యోగ వ్యవహారములు గురించి త్రిప్పట, శ్రమ వ్యయ ప్రయాసలు కల్గుచుండును. అన్ని వ్యవహారములు కలసి వచ్చినట్టుగ భ్రమ కల్గిజారిపోవుచుండును. విశేషమైన పెద్ద ఆలోచనలు కల్గుచుండును. అయితే ఏ కార్యమయిననూ పెద్దవి మాత్రమే కల్పించుకొందురు. సంఘములో అన్నియు తెలిసినవారివలె నటింతురు. తరచు చర్మరోగములు, దురదలు, కాళ్ళు-కీళ్ళు నొప్పులు కలుగుచుండును. వ్యవసాయ వ్యాపార జాయింటుదారుల వలన ఇబ్బందుల నెదుర్కొందురు. ఇతరుల వ్యవహారములో తల దూర్చకుండుట మేలు. స్వల్పకాలిక పెట్టుబడులతో వ్యాపారములు సాగించిన లాభించును. 4,5,6 మాసములందు కుజదోషమువలన శస్త్ర బాధ, భూ-వ్యవహార మార్పులు, కళత్రవర్గ కలతలు - కల్గుచుండును. జాయింటు వ్యాపారములందు వీరివలన ఇతరులు లబ్ధిని పొందుదురు. విదేశీ యానములు అనుకూలించును. ఆర్థిక చిక్కులు కల్గుచుండిననూ ధనమునకు లోటురాదు. భూగృహ నిర్మాణములు నిలుపుదల మేలు. తరచు మొండివైఖరిని అవలంబించుచుందురు.

4,5 మాసములందు ఇతరులవలన ధన వ్యయము, అకృత్యములు, అధిక వ్యయము, శస్త్ర చికిత్సాదులు, మనోవ్యాకులత, గౌరవముగురించి ప్రాకులాడుచుండుట, 6,7 మాసములందు వివాదములు కల్గి క్రమంగా మేలు కల్గును. ఏదో విధముగ ధనము చేతికందును. శయ్యాభోగము, మృష్టాన్నభోజనసౌఖ్యము, యత్నబదలీలు, విందు వినోదములు, 8,9 మాసములందు దుర్వ్యయము, దైవకార్యములు, ఇతరులచే స్తోత్రములు, శారీరక సుఖములు, ధర్మవిరతి సంతానమునకై

కృషి అయితే మాట నిలకడ తక్కువగుట, నడుము-కాలు సంబంధ అనారోగ్యములు. 10,11 మాసములందు ఆకస్మిక ధనలాభము. క్రమముగ వృద్ధి, యత్నకార్యసిద్ధి, పుణ్యకథాశ్రవణము. విఫలకోర్కెలు. 12,1 మాసములందు వ్యాపారవ్యయములు. లోభిత్వము. సంతానప్రాప్తి, కళ్యాణాది శుభనిశ్చయములు, భూప్రాప్తి, ఆత్మీయ ధనలాభము, మిగిలిన మాసములందు ఆర్థికవక్రములు, శృంగారాభిలాషణ, ఇంద్రియనిర్వీర్యత. సుందరరూప-ధనవంతత. యువతీ ప్రియత్వము మున్నగు లక్షణములుండును.

విద్యార్థులు అత్యధిక శ్రమ, కృషి కల్గిన గాని ఉత్తీర్ణత నొందలేరు. ఇంటా, బయటా ఎన్నో సమస్యలు ఎదుర్కోవలసి వచ్చును. అన్ని రంగముల విద్యార్థులకు మిశ్రమ సామాన్య ఫలితములే ఉద్యోగులకు జనవరి తదుపరి గురుబలము లేమిచే బహుశ్రమ, నిదానము, ఓర్మి అవసరము. సాంకేతికశాస్త్ర కళాకారులకు సంవత్సర ప్రారంభం అంత్యములందు అనుకూలము కల్గును. అపరములు, యాంత్రిక, తైలవ్యాపారముల వార్కి మిశ్రమ ఫలితములు. నూతన వ్యాపారములు పెట్టుబడులు తగ్గించుట మేలు. మత్స్యములు, కోళ్ళు, ఆహారపదార్థములవారికి వ్యాపారములు తగ్గించుట మంచిది. అపరములు, తైల, వస్త్ర, యంత్ర వ్యాపారులకు 4,5,6,8,11,2,3 మాసములు కాక మిగిలిన మాసములందు విశేషముగ లాభించును. రైస్ మిల్లర్లు, కలప, మిర్చి వ్యాపారులకు బహు సామాన్యకాలము. షేర్లు, జాయింట్లు, నిలువలు కలసిరావు. కంట్రాక్టర్లు. యింజనీరింగు, శాస్త్ర, స్వతంత్ర-వృత్తులవారికి ఉత్తరార్థము కంటె పూర్వార్థము మేలు.

ఉత్తరవారికి కెంపు పుష్యరాగము ధరించుటమేలు - హస్తవారికి ముత్యము, ఎమరాల్డ్ ధరించుట. శ్రీ రాజరాజేశ్వరి పూజలు చాలామంచిది. చిత్తవారికి పగడము, ముత్యము ధరించుట మేలు.

ఈ రాశివారికి అదృష్టసంఖ్య 5. 5, 3, 6 తేదీలతో కలసివచ్చు బుధ, గురు, శుక్ర వారములు యోగ్యప్రదములు.

మొత్తం మీద ఈ రాశివార్కి అత్యంత సామాన్యకాలం. వాతావరణ ప్రతిబంధకములు అధికంగా వుండును. సంపూర్ణ నవగ్రహ జపశాంతులు, కుమారస్వామి - వేంకటేశ్వర, రుద్రాభిషేకములు, మృత్యుంజయ జపములు అన్న శాంతులు, శివలింగ దర్శనము వలన ఋణవిమోచన, మనశ్శాంతి, వ్యవహార జయములు, సౌఖ్యములు కల్గును.

స్త్రీలు గణేశ, శ్యామలాదండకములు, శుక్ర గురువార నియమములు చేయుట ఆంజనేయ స్తోత్రములు చేయుటవలన కుటుంబమునకు మేలు కల్గును.

## తులారాశి

### (చిత్త 3,4 పాదములు, స్వాతి 1,2,3,4 పాదముల, విశాఖ 1,2,3 పాదములు)

ఆదాయం 2, వ్యయం 8 — రాజపూజ్యం 1, అవమానం 5

ఈ రాశి వార్కి గురుడు 98 జనవరి వరకూ 4ట రజిత మూర్తి, తరువాత వత్సరమంతయు 5ట లోహమూర్తి. శని వత్సరమంతయు 6ట లోహమూర్తి. జూన్ 24 వరకూ రాహువు 12ట, కేతువు 6 ట లోహమూర్తులు, తరువాత వత్సరమంతయు రాహువు 11ట, కేతువు 5ట లోహమూర్తులు.

ఈ సంవత్సరం వీర్కి గురుబలము మధ్యమము, శనిబలము మిశ్రమము సగం శుభత్వము. జూన్ తరువాత కేతువు సామాన్య స్థితి. రాహువుయోగమును కల్గించును. గ్రహబలముచే ఈ రాశి వారికి చాలావరకు గతసంవత్సరం కంటె మేలనిపించును. తరచు ఋణములు చేయవలసి వచ్చిననూ లెక్కలోనిది కాదు. ఆరోగ్యం గురించి తరచు తగు శ్రద్ధ కల్గివుందురు. సంవత్సర ప్రారంభమున కుజుని లాభస్థితి వలన సన్మాన గౌరవములు, గట్టిగ మాట్లాడుట, భూపశువాహన లాభము, దుర్బుద్ధిరీత్యా ధనవ్యయము, ఇతరుల వలన స్వయస్థిరమునకై ధనవ్యయము సంవత్సరాంతమునకు వివాద వ్యవహార లావాదేవీలు ఫలించుట, స్నేహసంపత్తులు నిలుబాటుగ నుండును. అప్పుడప్పుడు శత్రు-చోర బాధలు, వ్యాపార స్థాన మార్పులు కల్గుచుండును.

విద్యార్థులకు మొత్తంమీద గతంకంటె నయము. ఆంగ్లము, న్యాయవాద, చిత్రలేఖన, శాస్త్ర కోవిదులకు మిశ్రమ ఫలితములు, ఉపాధ్యాయులు, న్యాయవాదులు, వైద్యవిద్యార్థులకు ఉన్నతి, ప్రత్యేక ప్రశంసలు కల్గును. బ్యాంకర్లు, లెక్చరర్లు, గణితము, భాషేతర ఉద్యోగులకు సంవత్సర ప్రారంభమునందు, చివరియందు ఉత్సాహ ఫలితములు కల్గును.

ధాన్యము, బియ్యము, అపరములు, కలప, మిర్చి వ్యాపారులకు 4,5,8,11,1,2 మాసములు కలసి వచ్చును. ఫైనాన్స్, సినీ, న్యాయవాద, వస్త్ర, తైల వ్యాపారులకు 4,5,8,9,11,12,3 మాసములందు ఆకస్మిక తనిఖీలు. ఇతరుల ద్వారా ఇబ్బందులు, వ్యయ, ప్రయాసలూ కల్గును. శాస్త్రకోవిదులకు, సాంకేతిక వస్తు, ఇతర వ్యాపారులకు క్రమముగ వృద్ధి కల్గును.

4,5 మాసములందు ధనసమృద్ధి, వ్యవహార రీత్యా అనుకూల వాతావరణములు, చేయుకృషియందు సంతుష్టి, మంచివాక్కువలన ఆదాయము, ఉద్యోగ ఉన్నతి, వ్యాపార-ఉద్యోగ లాభములు.

6,7 మాసములు పరీక్షాకాలము. మించిన ధనవ్యయములు. ప్రారంభము అనుకూలత, తరువాత ప్రతికూలత, ఇంద్ర పరాక్రమవంతులయిననూ శతృవ్యూహరీత్యా ప్రమాదము, బహు ధనవ్యయము. కార్య విఘ్నములు.

8,9 మాసములందు స్వల్ప వాదనలు. మనో ఆనందము. స్త్రీ సౌఖ్యం, సత్సంగ సద్వ్యయము, భోగము, పుణ్యకథా శ్రవణము. దైవకార్యాసక్తత. కొద్దిపాటి ఋణవిముక్తి, గృహమందు కళ్యాణాది శుభసిద్ధి, శుభవ్యయము.

10,11 మాసములందు మితభాషణము, నూతనాలంకారవస్తు ప్రాప్తి, లలిత కళాప్రియత్వము, వివాదములు ఆత్మబంధుసుఖము, విద్యావృద్ధి స్వలాభముకొరకు ధాతృత్వము, కోరికలు -

12,1 మాసములందు కొద్ది పాటి కోపము, అసౌఖ్యము, యత్నకార్యసిద్ధి కల్గి వ్యతిరేకత, శుభలాభ నిర్ణయము, నిలబాటు - ఆర్థిక నిలబాటు-అయినా మనోధైర్యం. పరాపేక్ష ద్వారా కార్యసిద్ధి కల్గును.

2,3 మాసములందు నాస్తికబుద్ధి, కఠిన మనస్తత్వం, శతృచోర రాజనిర్భయత. వివాహ భూగృహాది లాభము, క్షీరసమృద్ధి, ఉత్సాహము కల్గును. సంతానాది సూచనలు - ఆత్మ గౌరవము చాటుట మున్నగు లక్షణములు కల్గును. రాజకీయము అనుకూలము కాదు. షేర్లు లాభించవు. నిల్వలు సరిపడును.

మొత్తం మీద ఈ రాశి వార్కి గతం కంటె చాలా మేలు. భూగృహ శుభకార్య కళ్యాణయోగములు సిద్ధించును. ఋణము, వ్యాపారవృద్ధి కల్గుచుండును. లోటురాదు. ఉన్నతమైన వారికీ, సామాన్యమైన వారికీ సహకార మిత్రత్వములు బాగుండును.

చిత్తవార్కి పుష్యరాగము యోగప్రదము. స్వాతివార్కి గోమేధికం ధారణ ఉత్తమం. తలంచిన వ్యాపారములు యోగించు కాలం. విశాఖ వార్కి ముత్యం, పగడం యోగప్రదము.

వీర్కి అదృష్ట సంఖ్య 6. 1,4,5,8 తేదీలు సంఖ్యలు ఆది సోమ శనివారములు కలసిన విశేషములు.

ఈ రాశివార్కి రాహు, గురు, కుజగ్రహజపములు, దుర్గా లక్ష్మీపూజలు సోమవార నియమములు విశేషముగ యోగించును.

స్త్రీలు గణేశ, శ్రీకృష్ణ పూజలు-శుక్ర, సోమవార నియమములు చేసిన మానసిక ప్రశాంతత, ధన సర్దుబాట్లు, కుటుంబమందు పురోభివృద్ధి కల్గును.

## వృశ్చికరాశి

### (విశాఖ 4వ పాదము, అనూరాధ 1,2,3,4 పాదములు, జ్యేష్ఠ 1,2,3,4 పాదములు)

**ఆదాయం 8, వ్యయం 14** — రాజపూజ్యం 4, అవమానం 5

**ఈ రాశివారికి గురుడు 98 జనవరి 8వ తేదీ వరకూ 3ట లోహమూర్తి. తరువాత వత్సరాంతం వరకూ 4ట తామ్రమూర్తి. శని వత్సరమంతయు 5ట సువర్ణమూర్తి. జూన్ 24 వరకూ రాహువు 11ట, కేతువు 5ట తామ్రమూర్తులు. తరువాత వత్సరాంతము వరకూ రాహువు 10ట, కేతువు 4ట సువర్ణమూర్తులు.**

వీరికి గురుబలము 3/4 వంతు యోగదాయకము. శని యోగప్రదమయినది కాదు. జూన్ వరకు రాహుబలము పూర్ణము. తరువాత మిశ్రమము. చతుర్థకేతువు జూన్ తరువాత మిశ్రమ ఫలితము లిచ్చును.

మొత్తంమీద వీరికి సంవత్సరమంతయు మిశ్రమ ఫలితములు. ఆర్థిక సమస్యలు, పుత్రాది సంతాన సమస్యలు, కాలు కీళ్ల నొప్పులు, వాతతత్వ ఉదర స్థాన అనారోగ్యములు కలుగుచూ ఔషధ సేవలు చేయవలసి వచ్చును. శని పాపి అయిననూ కొంతవరకు కొద్దికాలము కుజ వీక్షణముచే తటస్థముగ ఉండును. మించిన భారములు మోయవలసి వచ్చును. ఇతరుల సహకారము ఎల్లప్పుడూ బాగుండును. పట్టుదల ఉన్ననూ చేయు వృత్తియందు ఆటంకములు, భూవివాదములు కలుగుచుండును. గత సంవత్సరం కంటె కొన్ని రంగములలో మేలు కలుగును. ఏ పనినయినా హెచ్చు శ్రమతోగాని సాధించలేరు.

4,5 మాసములందు మిశ్రమ ఫలితములు, వ్యవహార వక్రత్వ చికాకులు, కుటుంబ ఈతి బాధలు, ధన వ్యయము, దుర్వ్యయమగుట, పరాజయము, ముఖ్య కార్యముల నిలబాటు.

6,7 మాసములందు స్వల్ప అనారోగ్యము, స్వల్ప వ్యాపారవృద్ధి, శ్రమకు మించిన ఫలితములు. వ్యవహార ఒడుదుడుకులు కలిగి యోగించుట, భూమి సంబంధ వివాదము సూచించును.

8,9 మాసములందు ఉన్నతోద్యోగప్రాప్తి, ధర్మనిరతి, బంధు సుఖము, సమర్థించుకొనుట, శతృవిజయము, నేత్ర అనారోగ్యము, స్వల్ప పరపీడనము.

9,10 మాసములందు భూరత్న లాభములు, మనో నిర్మలత, వాణిజ్య లాభము, ఉన్నతాధికార సందర్శనములు మాతృవర్గ అపబలము.

11,12 మాసములందు మాటనిలకడ తక్కువగుట, పూర్వాస్తివ్యయము, ఉదరం, నడుము సంబంధ అనారోగ్యము, కార్య తొందర, తమ నేర్పువలన సత్ఫలితము 1, 2 మాసములందు దుర్వార్తాశ్రవణం సుఖం గురించి తాపత్రయం, లేఖనము, సుందరచ్ఛాయ, పరోపకారము.

3,4 మాసములందు సర్వసౌఖ్యములు కలుగును.

విద్యార్థులకు మిశ్రమ ఫలితములు, సైన్సు, సాంకేతిక విద్యార్థులకు మంచి ఫలితములు, గణితం, ఇంజనీరింగ్, న్యాయవాద, ఆంగ్ల విద్యార్థులకు ఉన్నతి కలుగును. ఉద్యోగులుకు పరీక్షా కాలము. స్వయం వృత్తివారికి ప్రారంభం కొంచెం ఇబ్బందికరంగా ఉన్నా తరువాత క్రమముగ గుర్తింపు, ధన లబ్ది కలుగును.

అపరములు, కలప, మిర్చి వ్యాపారులకు 5,6,10,11,12 మాసములు కాక మిగిలిన మాసములు కలసివచ్చును.

తైల, యాంత్రిక భూ వ్యాపారులకు 5,7,9,12 మాసములు అంతగా కలసిరావు. ఫైనాన్స్, వస్త్రం, బియ్యం, సినీ కళాకారులు 5,7,8,9,12 మాసములు అభివృద్ధికరం.

రాజకీయ నాయకులు - కాంట్రాక్టర్లకు ఇబ్బందికరము. స్వయం వృత్తులు వారికి, కళాకారులకు, శాస్త్ర కోవిదులకు ప్రారంభమున పరీక్షాకాలముగ ఉన్ననూ విశేషమైన కాలము. ప్రశంసలనందు కొనదగుకాలము. స్థిరాస్తులు వృద్ధి చెందును. వ్యవసాయదారులకు విశేషమయిన కాలము - ఇంకనూ భూవృద్ధి కలుగును. నూతన గృహ నిర్మాణము లాశించవచ్చును. జాయింట్లు. విలువలు తాత్కాలికముగ కలసివచ్చును.

వీరు ప్రతి పనినీ స్వతంత్రముగానూ, నేడు నేర్పుగానూ చేయుచుందురు. ఇతరులను నమ్మరు. కుటుంబము రీత్యా సోదరుల వలన ఇబ్బందుల నెదుర్కొందురు.

విశాఖవారికి పుష్యరాగం, పగడము ధరించుటచే కలసివచ్చును. అనూరాధ వారికి నీలము - పగడము, జ్యేష్ఠవారికి పగడము, వజ్రము కలసివచ్చును.

ఈ రాశి వారికి అదృష్టసంఖ్య 9. 1,2,3,7 తేదీలు, సంఖ్యలు, సోమ, గురు, శనివారములు కలసివచ్చును.

నవగ్రహ జపశాంతులు - విష్ణు, లక్ష్మీస్తోత్ర పఠనము, ఆదిత్య - శనివార నియమములు చేయుటచే అపమృత్యు, అనారోగ్యాది అవాంతరములను అధికమించి శాంతి నొందెదరు.

స్త్రీలు గురువార నియమములు - పగడము ధరించుట వలన కుటుంబమందు ఆర్థికాభివృద్ధి, ఆరోగ్యవృద్ధి, శాంతి, సంతాన వృద్ధి కలిగి మేలు జరుగును.

## ధనూరాశి

(మూల: 1,2,3,4 పాదములు, పూ.షా. 1,2,3,4 పాదములు, ఉ.షా. 1 పాదము)

ఆదాయం: 11 వ్యయం: 5 రాజపూజ్యం: 7 అవమానం: 5

ఈ రాశివారికి గురుడు 1998 జనవరి 8 వరకూ 2ట తామ్రమూర్తి. తరువాత వత్సరాంతం వరకూ 3 ట సువర్ణమూర్తి. శని వత్సరమంతయు 4ట రజితమూర్తి. జూన్ 24 వరకూ రాహువు 10ట. కేతువు 4ట సువర్ణమూర్తులు. తరువాత వత్సరాంతం వరకూ రాహువు 9ట, కేతువు 3ట రజితమూర్తులు.

ఈ రాశివారికి గురుడు మాత్రము మిగిలిన గ్రహములకంటె, గత సంవత్సరము కంటె ఈ సంవత్సరం 3/4 వంతు యోగ్రపదుడు. అర్ధాష్టమ శని స్థానభంగం, ఆరోగ్యశూల, మనోవ్యధ, ఉదరము - కాలు, మోకాళ్ళు పర్యంతం ఆరోగ్యలోపములు, వ్యవహారముల గురించి తరచు తిరుగుచుండుట, ధనవ్యయం, శ్రమ కలిగించుచుండును.

వీరు గౌరవము గురించి ప్రాకులాడుచుందురు. కార్యక్రమాలను పూర్తి చేయు సందర్భంలో తరచూ కంగారు పడుచుందురు. కోర్టు వ్యవహార లావాదేవీలు ఎంత కంగారు పడిననూ సమయం వృధా తప్పదు. జూన్ తర్వాత కేతుగ్రహ ప్రభావంచే కొద్దిమందికి స్థిర ఉద్యోగ లాభములు, దైవ కార్యాచరణములు. భూగర్భం నుండి అపూర్వ వస్తులాభం. ఔషధ సేవతో కొద్దిపాటి ఆరోగ్యవృద్ధి కలుగును. కొంతమందికి సుఖ భోజనం, ఇష్టార్థ లాభం, వృత్తి వ్యాపారాలలో అనుకూలత, స్వల్పముగానైననూ ధనమునకు లోటు లేకుండుట, పాండిత్యగోష్ఠి, అయిననూ ఇంటిపోరు మొ॥గు లక్షణములు ఉండును. భూ, గృహ వ్యవహారములందు వ్యవహార మెళకువ తప్పనిసరి. ఇతరుల వ్యవహారములో తలదూర్చరాదు. ఈ సంవత్సరం చేయు వ్యాపార, వ్యవహారములు చిరకాలమునకు అనుకూలించును. ముఖ్యంగా నరముల బలహీనత, మోకాలు నొప్పులు, నల్లని జంతువుల వల్ల భయం కలుగుచుండును. శుభకార్యాదులు మాత్రము సునాయాసంగానే కలసివచ్చును.

విద్యార్థులకు అత్యధిక శ్రద్ధ వహించినగానీ ఉత్తీర్ణులు కాలేరు. వ్యవహార, గృహ సమస్యలను దూరంగా ఉంచవలెను. బ్యాంకర్లు, ఇంజినీర్లు, లెక్చరర్లు, ఉపాధ్యాయులు 4,5,6,8,9,1,2 మాసములందు అనేక సమస్యలు ఎదుర్కొనవల్సి వచ్చును.

వ్యవసాయదార్లకు శ్రమ మిగులును. అపరములు, కిరాణా, ఫ్యాన్సీ, ఆహార, వస్త్ర, వ్యాపారులకు మొత్తంమీద నయం, రైస్‌మిల్లర్లు, యాంత్రిక నిర్మాణ, ఇనుము వ్యాపారులకు, నూతన యంత్ర నిర్మాణములు కలుగును. న్యాయవాదులు, సినీవృత్తులవారికి, యంత్ర, తైల, వ్యాపారులకు, స్వయం వృత్తుల వారికి 4,6,7,8,11,1 మాసములు యోగించవు. కాంట్రాక్టర్లకు, నిల్వదార్లకు, అనుకూలం కాదు.

మత్స్య, కోళ్ల వ్యాపారులకు వాతావరణ ప్రతిబంధకములు. 4,5 మాసములందు స్వల్ప జయము, కఠిన మనస్తత్వము, సోదరవైరము, సంతాన అనారోగ్యం, స్వల్పసౌఖ్యం.

6,7 మాసములందు దాసదాసీసుఖము, సన్మాన గౌరవములు, పరాక్రమము, స్వయంకృషి, శృంగారాభిలాషణం, ఆనందం, స్త్రీ మూలక ధనలాభం.

8,9 మాసములందు భూ, గృహ సంబంధ ప్రయత్నములు స్వల్పప్రాప్తి. త్రిప్పట, ప్రభుత్వముల అనుకూల వాతావరణములు, ఉద్యోగలాభం.

10,11 మాసములలో కార్యవిఘ్నము, గాయములు, వ్యాపారలబ్ధి.

12,1 మాసములందు మాటతొందర, మృష్టాన్న భోజనములు, ప్రయాణము రీత్యా ధనలాభము.

మిగిలిన మాసములలో దైవక్షేత్ర సందర్శనములు, ఉద్యోగ ఉన్నతి, అప్పుడప్పుడు కోపం, చర్మవ్యాధులు, శుభకార్యాలు, గృహ నిర్మాణములు, యత్నకార్యసిద్ధి కలుగును.

ఈ రాశివారికి సంవత్సరం కొన్ని సరిక్రొత్త వ్యవహార చిక్కులూ, లావాదేవీలూ ఏర్పడినమా గురుబలముచే పరిష్కరింపబడి మేలు కలుగును.

మూల వారికి వైఢూర్యం, పూర్వాషాఢ వారికి వజ్రం - పగడం, ఉ॥షాఢ వారికి కెంపు, పగడం ధరించిన మేలగును.

ఈ రాశి వారికి అదృష్ట సంఖ్య 3. 1,4,6,7 తేదీలు, సంఖ్యలు, ఆది, బుధ, గురువారములు యోగ్రపదములు.

మొత్తం మీద ఈ రాశి వారికి శని, కుజ, రాహు, కేతు గ్రహములను ఆరాధించుట, రుద్రాభిషేకము, సుబ్రహ్మణ్యాభిషేకములు యోగ్రపదములు. లక్ష్మిగణేశ, సుందరీ, దుర్గా పూజలు జరుపుట శాంతిదాయకం, మనోభీష్టము నెరవేరును. శని, గురువార నియమములు ఉండుట మంచిది.

స్త్రీలు సూర్య, లక్ష్మి, దుర్గా అష్టకపారాయణములు, హనుమత్ పూజలు చేయుటవలన, గృహచ్ఛిద్రములు తొలగి భర్తృపుత్ర ఆయురారోగ్య లాభములును, లక్ష్మీవృద్ధియును కలుగును.

## మకరరాశి

(ఉత్తరాషాఢ: 2,3,4 పాదములు, శ్రవణం 1,2,3,4 పాదములు, ధనిష్ఠ 1,2 పాదములు)

ఆదాయం: 14 వ్యయం: 14 రాజపూజ్యం: 3 అవమానం: 1

ఈ రాశివారికి గురుడు 98 జనవరి 8 వరకు జన్మమందు సువర్ణమూర్తి. తరువాత వత్సరమంతయు 2ట రజితమూర్తి. వత్సరమంతయు శని 3ట సువర్ణమూర్తి. జూన్ 24 వరకు రాహువు 9ట, కేతువు 3ట రజితమూర్తులు. తర్వాత వత్సరం అంతయూ కేతువు 2ట రాహువు 8ట సువర్ణమూర్తులు.

ఈ రాశివారికి జన్మగురుడు పరిపూర్ణ దోషప్రదుడైనమా నీచస్థితి వలన చాలావరకూ మేలు కలిగించి నిలబాటు చేయును. రాహువు, కేతువులు సామాన్య ఫలితము లిచ్చుదురు. శని పరిపూర్ణ యోగ్రపదుడు. కార్యసిద్ధిని పట్టుదలను, భూగృహ శుభ కార్యసిద్ధిని కలిగించును.

ఏప్రిల్, మే లందు అష్టమ కుజుడు, అర్ధాష్టమ రవి ప్రభావంచే పరగృహవాసము, ప్రయాణ ఇబ్బందులు, మోసబాధలు, నడుమునొప్పి మొదలగు లక్షణములు సూచించును. సామూహిక కార్యక్రమములందు పాల్గొందురు. తరచూ కవితా ప్రసంగములు, పరస్పర అసూయా ద్వేషములు కలుగుచున్నా లెక్కించరు. ఉద్యోగస్తులకు సం॥ ఉత్తరార్థమందు స్థానచలన, చింత విజయసూచకముగా వ్యవహారం నిలబాటు, లావాదేవీల విజయం. చిరకాల ప్రయత్నములు సానుకూలత కలుగును. శుభ, కార్య, భూగృహ యోగములు సిద్ధించును.

విద్యార్థులకు విశేష కాలం, న్యాయవాద, శాస్త్ర విద్యార్థులకు ఇంటా బయటా సమస్యలు. గణితము, భాషేతర విద్యార్థులకు ఉన్నతి కలుగు సమయం. ఉద్యోగులకు సుమారు యోగకాలం. యంత్ర, వస్త్ర, తైల, జల, చర వ్యాపారులకు ఆగష్టు నుండి డిశెంబరు వరకు అంతంత మాత్రంగా గడిచినమా యోగదాయకంగా ఉండును. మిర్చి, అపరములు, ఫ్యాన్సీ, కలప, పసుపు, వ్యాపారులకు 6,7,8,1,2 మాసములు కాక, మిగిలిన మాసములు అత్యంత యోగదాయకములు. రైస్ మిల్లర్లు, శాస్త్ర కోవిదులకు శాస్త్రవేత్తలకు సం॥ ఉత్తరార్థం కలసివచ్చును.

4,5,6 మాసములందు చంద్ర, గురుల బలంచే శుభ కార్యసిద్ధి సంతాన, ధన లాభములు. కార్యసాఫల్యత, స్వల్పలాభం.

7,8 మాసములందు పరస్పర సహకారములు. చర్చలు, ఋణబాధలు, వ్యవహార ప్రయత్నములు.

9,10 మాసములందు కుజబలంచే ఆరోగ్య లాభం. వ్యవహారజయం. ప్రయాణలాభం, మిత్ర, ప్రభువుల అభిమానములు. ప్రయాణములు. కావి విదానం మేలు.

11,12 మాసములందు నేత్రము, కంఠము, మానసిక ఆరోగ్య వ్యథ. మాతృవర్గ అనారోగ్యం. ఉత్తమ భోజన శయనములు. బహుధనవ్యయం. పౌరుషం, భోగం, శుభకార్యం. స్త్రీల వలన వ్యవహార ఇబ్బందులు. మొదలగు సూచనలు.

వీరికి 2,3,6,7,8,9,10,12 మాసములు యోగదాయకములు.

మిగిలిన 4,5,11,1 మాసములందు వ్యయ ప్రయాసలలో ధనార్జన, బద్ధకం, రాజకీయ అధికార లాభం. రాజకార్యదీక్ష మేలు కలుగును.

ఉ॥షాఢవారికి కెంపు, పచ్చ, శ్రవణం వారికి ముత్యం, పుష్యరాగం, ధనిష్ఠ వారికి పగడం ధరించుట మంచిది.

మొత్తం మీద ఈ రాశి వారికి నూతన వ్యాపార ప్రారంభములు, స్థిరముల వృద్ధి, గృహ లాభములు, కళ్యాణాది శుభములు సంవత్సర పూర్వార్థమునందును, అంత్యమునందును కలిసివచ్చును. గురుబలము వలన లోపములు, చికాకులు తొలగును. ఆరోగ్యము బాగుండును. గురు, కుజ, రాహు కేతువులకు జపశాంతులు చేయుటవలన యత్నకార్యసిద్ధి, శుభకార్యానుకూలత, ఆరోగ్య లాభములు కలుగును.

మంగళ, శుక్రవారములు యోగ్రప్రదములు. పగడం ధారణ మంచిది. వ్యవసాయదార్లకు శ్రమ ఫలితములుండును. కాంట్రాక్టర్లకు, జాయింట్‌లు, నిల్వలు యోగించవు. స్పెక్యులేషన్ యోగించదు. రాజరాజేశ్వరీ, దుర్గ, అంజనేయ ఆరాధనలు, సూర్య నమస్కారములు ఉత్తమం.

ఈ రాశి వారికి అదృష్టసంఖ్య 8. 3,4,6,9 తేదీలు, సంఖ్యలు సోమ, శుక్ర, శని వారములు యోగించును.

స్త్రీలు గురు, శుక్రవార నియమములు, గణపతి, లలితా, విష్ణుస్తోత్రములు జరుపుట కుటుంబమందు శాంతిదాయకం. భర్తృ, పుత్రసౌఖ్యం, ఋణవిముక్తి, గర్భిణీలకు (సుఖప్రసవం) శాంతి కలుగును.

## కుంభరాశి

(ధనిష్ఠ 3, 4 పాదములు, శతభిషం 1,2,3,4 పాదములు, పూ.భా.1,2,3 పాదములు)

ఆదాయం: 14 వ్యయం: 14 రాజపూజ్యం: 6 అవమానం: 1

ఈ రాశి వారికి గురుడు 98 జనవరి 8 వరకూ 12ట రజితమూర్తి. తదాది వత్సరం అంతయు జన్మమందు లోహమూర్తి. శని వత్సరమంతయు 2ట లోహమూర్తి. జూన్ 24 వరకు రాహువు 8ట కేతువు 2ట లోహమూర్తులు తర్వాత కూడా, రాహువు జన్మమందు, కేతువు 7వ స్థానము నందూ లోహమూర్తులే.

ఈ రాశివారికి గత సం॥ కంటె బహుపరీక్షా కాలం. ద్వితీయ శనిచే ఆర్థిక అసమానత్వములు, అవమానములును, వ్యవహార కార్య భంగములు - రాహు, కేతువుల ప్రభావంచే ఆకస్మిక అపనిందలు, ధనవ్యయములు కలుగుచుండును. శుభకార్యములు, భూ, గృహ నిర్మాణాదులు, వ్యాపారాదులు బహు ఓర్మితో నిలబాటు కల్గించుకొనుచూ చేయుట మంచిది. ఆర్థిక బలము కంటె గౌరవమునకు ప్రాధాన్యం ఇవ్వవలెను. సం॥ర ప్రారంభమునందు కుజదోషం వలన అంగారక రాహు, కేతు జపములు ఆచరించుట మంచిది. తరుచూ, రుద్రాభిషేకాలు, చండీ ప్రదక్షిణలు, శివలింగ దర్శనం చేయుట వలన దోషము కొంతవరకూ శాంతించును. స్వజన విరోధం, శస్త్రభీతి, సకల విషయహాని, అసత్యవాదం, పరస్నేహ, పరవ్యాపార, పర ఉద్యోగ, పరదేశ గమనం మున్నగునవి ఆశించుట సూచించిననూ బహు నిదానముతో మెలగవలెను.

వ్యయసాయదార్లకు, వ్యాపారులకు పెట్టుబడులు తగ్గించి నిలుపుదల చేయటం ఉత్తమం. శుభకార్య ఆచరణములు కొంచెం ఆలస్యంగా జరుగును. నిల్వదార్లకు, కాంట్రాక్టర్లకు, జాయింట్ దార్లకు అనుకూలత కాదు. స్పెక్యులేషన్ కలసిరాదు. ఎంతోకొంత స్వయంవృత్తి మేలు.

విద్యార్థులకు బహు పరీక్షాకాలం, సెప్టెంబరు ఛాన్స్ చూడవలసి వచ్చును. సామాన్య ఉద్యోగులకు విశేషకాలం. ఉన్నత ఉద్యోగులకు పరీక్షాకాలం. ఉన్నత వర్గ అధికారుల - బయట ప్రజల ద్వారా సమస్యలు ఎదురగుచుండి కొంచెము తగ్గుచుండును.

శాస్త్రకోవిదులు, వృత్తి కళాకారులకు 5,8,9,1,2 మాసములు అనుకూలము కావు. అన్ని రంగముల వ్యాపారులకు ఆకస్మిక దాడులు, ఇతరుల వలన ఈతిబాధలు కల్గిననూ లెక్కించరు.

సం॥ర పూర్వభాగమందు సప్తమ, అష్టమ కుజ దోషముచే ఆరోగ్య, కుటుంబ, దాంపత్య సమస్యలు, భూ వ్యవహార సమస్యలు కలుగుచుండును. ఏప్రిల్ నుండి జూలై వరకు అంగారక జపములు మంగళవార నియమములు చేయవలెను.

4,5,7,8,9,10 మాసములకంటె, మిగిలిన మాసములందు సూచించిన భూగృహ వ్యవహారములు అనుకూలత, క్రియా రూపమును దాల్చును. డిశెంబరు 17 శని వక్రత్యాగము వరకు కొన్ని నూతన సమస్యలు ఉత్పన్నమగుటచే శనీశ్వరునికి తైలాభిషేకాదులు, నవగ్రహారాధనములు ఆచరించి తగు సుఖమును పొందవచ్చును. ఎంతటి గ్రహదోషములున్ననూ, డిశెంబరు తరువాత జన్మ గురుడు దోషప్రదుడు అయిననూ స్వల్పముగానైననూ ఉపకరించును. ఏల్నాటి శని చివరి భాగమునకు చేరు సందర్భముగ చిరకాలమునకు భవిష్యత్తు బాటలు వేయించును.

రైస్‌మిల్లర్లు, యాంత్రిక, భూ, పశు, వ్యాపార, జలచర, కోళ్ల పరిశ్రమల వారికి సం॥ర ఉత్తరార్థం లాభించును. అపరములు, కలప, పుగాకు, ఫ్యాన్సీ, రసాయన, స్టేషనరీ వ్యాపారులకు 4,6,9,10,11,12 మాసములు విశేషముగ కలిసివచ్చును. ఫైనాన్స్, ఆర్థికశాఖ, కళాకారులు, వస్త్ర, తైల, ధాన్య, మిర్చి, పసుపు వ్యాపారులకు గ్రహబాధలున్ననూ 5,6,7,9,10,1 మాసములు విశేషముగా కలసివచ్చును.

98 జనవరి తరువాత సంఘ గౌరవములు, భవిష్యత్తు గురించి బాటలు, త్వరపాటు, ధనభోగము, వ్యయము, నరముల బలహీనత, సన్మానములు, కవితా పాండిత్య గోష్ఠులు, విదేశ - దూర యానములు కలసివచ్చును. శుభకార్యముల యందు నిదానము మేలు.

మొత్తము మీద ఈ రాశివారికి ఏలినాటిశని జరుగుచుండుటచేతను వ్యయ జన్మస్థాన - గురు సంచారము చేతను అన్ని రంగముల వ్యాపారాలను తక్కువ పెట్టుబడులతో చేయుట వలన మేలు కలుగును.

పూర్వాభాద్ర వారికి పుష్యరాగాభరణము, శతతార వారికి గోమేధికం, ధనిష్ఠవారికి పగడం - నీలమణి ధరించుట మేలు.

ఈ రాశివారికి అదృష్టసంఖ్య 8. 1,3,4,6,9 తేదీలు, సంఖ్యలు, ఆది, మంగళ, శుక్రవారములు యోగప్రదములు.

తరుచూ రుద్రాభిషేకములు, సుబ్రహ్మణ్య, శనీశ్వర తైలాభిషేకములు, శని సోమ వార నియమములు. శివ, గణపతి సహస్రనామములు ఆచరించిన బహుయోగప్రదము.

స్త్రీలు ఆదివార నియమములు, సూర్య, లక్ష్మి, కుమారస్వామి పూజలు జరిపించినచో కుటుంబ శాంతి సౌఖ్యములు, ఋణవిమోచన, భర్తృపుత్ర సౌఖ్యములు, ధనవృద్ధి పొందుదురు.

## మీనరాశి

(పూ.భా. 4వ పాదము, ఉ.భా. 1,2,3,4, రేవతి 1,2,3,4పాదములు)

ఆదాయం: 11 వ్యయం: 5 | రాజపూజ్యం: 2 అవమానం: 4

ఈ రాశివారికి 98 జనవరి 8వ తేదీ వరకు గురుడు 11ట లోహమూర్తి. తరువాత వత్సరాంతం 12 ట సువర్ణమూర్తి. శని వత్సరమంతయు జన్మమందు సువర్ణమూర్తి. జూన్ 24 వరకూ రాహువు 7 ట, కేతువు జన్మమందు సువర్ణమూర్తులు తరువాత వత్సరాంతం రాహువు 6ట, కేతువు 12ట సువర్ణమూర్తులు.

వీరికి ఏల్నాటిశని, నీచ గురుడు, చండాల గ్రహముల ప్రభావము అధికముగా ఉన్నది. అయిననూ మూర్తిమంతము రీత్యా గ్రహ సంచారం కంటె క్రియాత్మకమైన యోగఫలము లిచ్చునని శాస్త్రభావము. ఏదిఏమైనా రేవతి వారు బహుజాగ్రత్తగ మసలుకోవలెను. నీచ గురుని వలన సమన్వయలోపముచే చేయు వృత్తి, వ్యవహారములయందు చిక్కుల నెదుర్కో వలసివచ్చును. జూన్ తరువాత తరచు ధనవ్యయములు, ఋణములు, ప్రయాణములు 6,7,8,9,1,2,3 మాసములందు శస్త్ర చికిత్సాదులు, సంతాన సమస్యలు కలుగును.

సమస్త వ్యాపారులకు మిశ్రమ కాలము. బహు నిదానము నేర్పు అవసరము. స్థిరవ్యాపారులకు ప్రస్తుతం కంటె ముందు చూపు ఉండాలి. తాత్కాలిక వ్యాపారులకు యోగించును. సామాన్య వ్యాపారులకు వృద్ధి, పెద్ద వ్యాపారులకు లోపము కలుగును. చర్మ రోగములు, వాత, పిత్త పైత్య దోషములు - పితృవర్గ అపజలము. బుద్ధిమంతులైనా పరాపేక్ష, సద్వ్యయము.

అజ్ఞాత శతృభీతి, నల్లటి జంతుభీతి - వాహన భీతి, మాతృపితృ లోపములు కలుగుచుండును.

వీరిది హుందా మనస్తత్వమే అయినను హెచ్చుగ తొందరపాటు, కంగారు పడుట, మాట లేకితనము ప్రదర్శింతురు. సం॥ర ఉత్తరార్థమునందు స్వర్ణమణి రత్నలాభములు, వ్యాపార దూరాలోచనలు కలసివచ్చును. పరోపకార రీత్యా వ్యయము. తరచు ప్రయాణములు చేయుట కలుగును.

4,5 మాసములందు ముందు పుణ్యయాత్రా సిద్ధి, పరాక్రమము, శుభ సిద్ధి, భూగృహ నిర్మాణలాభములు. తరువాత ఒంటరి జీవితాభిలాషణము. నీచ జనవైరము, అనారోగ్యము, అనిద్ర, అభోజనము - సూచించును.

6,7 మాసములు దూర ప్రయాణము. స్త్రీ, అపవాదము - శస్త్ర, శతృబాధ, పరరక్షణాసక్తత, పితృమూలక స్థిరవిచారము. 3,9 మాసములందు ధనవ్యయము, దుష్టభాషణము, భూ పశువ్యయము, తరువాత శుభకార్యసిద్ధి, సేవాతత్పరత, జపతపసమారాధనము. 9ట కుజునిచే కోర్టు వ్యవహారములు, స్వల్ప జయము, కఠిన మనస్తత్వము, అధిక తెలివి, మనో అసంతుష్టి, నడుము సంబంధ ఆరోగ్యలోపము. 10,11 మాసములందు దాస దాసీ సేవకసుఖము, స్వయంకృషి, ధన లాభము, పరాక్రమము, వ్యాపార మార్పులు చేర్పులు, భూ, పశులాభం, కార్యదీక్ష, పుణ్యక్షేత్ర సందర్శనం. కాని సంతాన అసౌఖ్యము, ఆడంబరము, వివాదజయము, భోగము, నేర్పరితనము 12,1 మాసములందు కుజదోషముచే కఠిన సంభాషణము - ధనవ్యయం. ఇంద్రపరాక్రమము అయిననూ శతృత్వరీత్యా ప్రమాదము. అలంకార ప్రాప్తి, స్త్రీ విరోధము, కీర్తి వ్యయము - 2,3 మాసములందు శుక్ర వక్రత్యాగమువలన కొంచెం శాంతి. గతంలో ఆగిన వ్యవహారములు ముందునకు సాగు సూచన. కార్య విఘ్నములు, పాదములు, కటి ప్రదేశములందనారోగ్యములు సూచించును.

విద్యార్థులకు సంవత్సరం పూర్వార్థము కొంచెము మేలు. అతిశ్రమ మీద ఉత్తీర్ణులౌదురు. ఉద్యోగులకు సంవత్సరం మిశ్రమకాలం. తోటివారి సహకారము లవసరమగును. సాంకేతిక విద్యార్థులకు ఉన్నతస్థాయి. స్వల్పకాలిక వ్యాపారులకు కొంతవరకు యోగించును. పెట్టుబడుదారులకు అననుకూలము. యాంత్రిక, సంస్థాగత వ్యాపారులకు సమస్యలున్ననూ లెక్కించరు. పట్టుదలతో ముందుకు సాగుదురు. అపరములు, ధాన్యము, కలప, మిర్చి రసాయన వ్యాపారులకు 4,5,9,10,12,1 మాసములు విశేషములు. వస్త్రములు, ఫైనాన్స్, న్యాయవాద, సినీ, వైద్య కళాకారులకు, బియ్యం, తైల, వ్యాపారులకు పరీక్షాకాలముగ ఉన్ననూ విశేషయోగములు, ప్రశంసలు కలుగును. 4,5,9,10,11,12 మాసములు అత్యంత యోగదాయకములు. కంట్రాక్టర్లకు, లెక్చరర్లకు గత సం॥రం కంటె మేలు. ఉద్యోగస్తులకు 4,6,7,9,10,12,1 మాసములు యోగదాయకములు.

పూర్వాభాద్రవారు ముత్యము, పుష్యరాగాభరణము. రేవతి వారు పగడము - ఉత్తరాభాద్ర వారు నీలపుష్యరాగాభరణము పగడము ధరించుట మంచిది.

ఈ రాశివారికి అదృష్టసంఖ్య 3. 2,3,7,8,9 తేదీలు, సంఖ్యలు, సోమ, గురు, మంగళ వారములు కలిసివచ్చును.

మొత్తం మీద వీరికి సం॥రం మిశ్రమ ఫలితములున్నవి. సం॥ర ప్రారంభము, చివరలందు అనుకూల కాలము. సంపూర్ణ నవగ్రహజపములు. రుద్ర, శనీశ్వరాభిషేకములు. సుందరకాండ పారాయణములు. దుర్గా, లక్ష్మీ నృశింహస్తోత్రములాచరించిన శాంతి కలుగును.

స్త్రీలు శివ, గురువారములు చేయుట వలన సత్సంతాన, భర్త పుత్ర సౌఖ్యములు కలుగును. పుష్యరాగం, పగడం ధారణ వలన వరముల బలహీనత తొలగును. ఆరోగ్యం బాగుండును. ఋణవిముక్తి పుష్టి కలుగును.

* * *

## శుభముహూర్తముల సందర్భము

ఇందు బాహుళ్యముగ శుభముహూర్తములను నిర్ణయించి వ్రాసితిని. ఇందు వ్రాయబడిన వానికి స్వల్ప దోషములున్నను వాటికి పరిహారములను గమనించియే వ్రాయబడినవి. ఏకవింశతి మహా దోషములు, ఉపదోషములు, మీన చైత్ర, అత్తా, వేధలు మున్నగు వాటికిని దేశవ్యవస్థలను గమనించి వ్రాయబడినవి. కేవలము నిర్దుష్టమగు లగ్నములు సంవత్సరమునకు 3,4, గూడ దొరకుట కష్టము. సుప్రసిద్ధ సిద్ధాంతులును చిరకాలమునుండి గుణదోషములను నిరూపణ చేయుటయు వ్రాయుటయుగలదు. మరియు ప్రజాబాహుళ్యమునకు ఉపయోగించుకొనుటకు కొంతవరకు ముహూర్తములు వ్రాయబడినవి. సహృదయులు వాటిని గమనించి క్షీరనీర న్యాయముగా గ్రహించి ఆచరణ యోగ్యములగు వాటిని ప్రజలకు అందచేయవలసినదిగా మనవి చేయుచున్నాను. -- పంచాంగకర్త.

# శుభముహూర్తాని

## చైత్ర మాసము (8-4-97 నుండి 6-5-97 వరకు)

ఏప్రిల్ 8 శు. పాడ్యమి. మంగళ. అశ్విని. వత్సరాదిత్వేన నవవస్త్రాభరణ రాజ దర్శనాదీనాం మేషోరాజా ఉ.గం. 7-38. కర్కాటకోర ప.గం. 12-53.

11 శుక్ర. చవితి. రోహిణి. అన్నప్రాశనస్య మేషశ్చోరః ఉ.గం. 7-28.

12 శని. షష్ఠి. మృగశిర. మిథునంర ఉ.గం. 11-40

20 ఆది. త్రయోదశి. ఉత్తర. డోలారోహణస్య కర్కాటకోర ప.గం. 12-5.

22 మంగళ. పూర్ణిమా. చిత్త. కర్కాటకోర ఉ.గం. 11-59.

23 బుధ. పాడ్యమి. స్వాతి. అన్నప్రాశనస్య మిథునంర ఉ.గం. 10-56.

29 మంగళ. సప్తమి. ఉ.షా. కర్కాటకోవసుః ఉ.గం. 11-31.

మే 1 గురు. నవమి. ధనిష్ఠ. అన్నప్రాశనస్య వృషభోర ఉ.గం. 7-36.

2 శుక్ర. దశమి. శతభిషం. అన్నప్రాశనస్య వృషభశ్చోరః ఉ.గం. 7-32.

## వైశాఖ మాసము (7-5-97 నుండి 5-6-97 వరకు)

మే 9 శుక్ర. తదియ. రోహిణి. అన్నప్రాశనోపనయనాక్షర స్వీకార వివాహ గృహారంభ ప్రవేశ, కూపారంభ, క్రయ విక్రయా దీనాం వృషభశ్చోరః ఉ.గం. 7-5, మృగశిర వివాహ గర్భాదాన గృహ ప్రవేశాదీనాం వృశ్చికోరాజా రా.గం. 7-29.

10 శని. చవితి. ఆర్ద్ర. ఆశ్వలాయనోపనయనస్య కర్కాటకోర ఉ.గం.10-48, గర్భాధానస్య ధనుర్మతాంర రా.గం 10-36

11 ఆది. పంచమి. ఆర్ద్ర. అశ్వలాయనోపనయనస్య వృషభోర ఉ.గం. 6-57, మిథునం మతాంర ఉ.గం. 9-47, అక్షరస్వీకారం కర్కాటకోర ఉ.గం. 10-44, షష్ఠి పునర్వసు గర్భాధానస్య వృశ్చికోర రా.గం. 7-21

మే 12 సోమ. షష్ఠి. పునర్వసు. అన్నప్రాశన ఉపనయన అక్షరస్వీకార క్రయ విక్రయాదీనాం వృషభోమతాంర ఉ.గం. 6-54, మిధునమపిర ఉ.గం. 9-43, పుష్యమి వృశ్చికశ్చోరః రా.గం. 7-27.

16 శుక్ర. దశమి. పుబ్బ. కర్కాటకోరాజా ఉ.గం. 10-27, తులార సా.గం. 6-6, ఉత్తర వివాహస్య మేషోర తె.గం. 5-13.

19 సోమ. ద్వాదశి. చిత్త. అన్నప్రాశన, ఉపనయన అక్షర స్వీకారవాణిజ్యా దీనాం మిధునం మతాంర ఉ.గం. 9-18 కర్కాటకోర ఉ.గం. 10-14 తులార సా.గం. 5-52, గర్భాదానస్య మకరోర రా.గం. 11-30.

20 మంగళ. చతుర్ధశి. స్వాతి. వివాహస్య మేషోర తె.గం. 4-54

22 గురు. పూర్ణిమా అనూరాధ అన్నప్రాశన, అక్షరస్వీకార క్రయ విక్రయాదీనాం మిధునంరాజా ఉ.గం. 9-5, డోలారోహణ క్రయవిక్రయాదీనాం తులార సా.గం. 5-40, వివాహస్యధనూర రా.గం. 9-50, వివాహస్య మకరోమతాంర రా.గం. 11-19..

24 శని. తదియ. మూల. వివాహస్య మేషోమతాంర తె.గం. 4-38.

25 ఆది. తదియ. పూ.షా. ఆశ్వలాయనోపనయనస్య మిధునంర ఉ.గం. 8-54. పూ.షా. గర్భాధానస్య ధనూర రా.గం. 9-38, పూ.షా. కూపారంభస్య మేషోర తె.గం. 4-35.

26 సోమ. చవితి. ఉ.షా. అన్నప్రాశనోపనయన, అక్షర స్వీకారక్రయవిక్రయా దీనాం కర్కాటకోపి మతాంర ఉ.గం. 9-44.

27 మంగళ. షష్ఠి. ధనిష్ఠ. వివాహ గృహారంభాదీనాం మేషోర తె.గం. 4-29

28 బుధ. సప్తమి. ధనిష్ఠ. డోలారోహణక్రయ విక్రయాదీనాం తులార సా.గం. 5-18 వివాహ గర్భాదాన గృహప్రవేశాదీనాం ధనూర రా.గం. 9-26.

29 గురు. అష్టమి. శత. డోలారోహణ క్రయవిక్రయాదీనాం తులామతాంర సా.గం. 5-14.

31 శని. దశమి. ఉ.భా. డోలారోహణ క్రయవిక్రయాదీనాం తులార సా.గం. 5-05. రేవతి వివాహ గృహప్రవేశాదీనాం ధనూర రా.గం. 9-14.

## జ్యేష్ఠ మాసము (6-6-97 నుండి 4-7-97)

జూన్ 8 ఆది. తదియ. పునర్వసు. డోలారోహణ వాణిజ్యాదీనాం సింహోర ప.గం. 12-6. పుష్యమి గర్భాధానస్య మకరోర రా.గం. 10-13.

10 మంగళ. షష్ఠి. మఖ. వివాహస్య మేషోర రా.గం 3-36.

11 బుధ. షష్ఠి. మఖ. వివాహస్య మిధునంర ఉ.గం. 7-49. కర్కాటకోమతాంర ఉ.గం.8-45. సప్తమి మఖ వివాహస్య ధనూర రా.గం. 8-33.

12 గురు. సప్తమి. పుబ్బ: ఆశ్వలాయనోపనయనస్య కర్కాటకోర ఉ.గం. 8-40.

13 శుక్ర. అష్టమి. ఉత్తర. వివాహ గర్భాధాన గృహప్రవేశాదీనాం ధనుర్మతాంర రా.గం. 8-26.

జూన్ 14 శని. దశమి. హస్త. డోలారోహణస్య తులారా సా.గం. 4-14. వివాహస్య మేషోర తె.గం. 3-19 (ఽ చంద్రః)

16 సోమ. ఏకాదశి. స్వాతి డోలారోహణస్య వృశ్చికోర సా.గం. 5-3. గృహప్రవేశాదీనాం సింహోపిర ప.గం. 11-37.

18 బుధ. త్రయోదశి. అనూరాధ. డోలారోహణ క్రయవిక్రయాదీనాం తులార సా.గం. 4-0.

19 గురు. చతుర్దశి. అనూరాధ. వివాహ కర్కాటకోరాజా ఉ.గం. 8-15.

20 శుక్ర. పూర్ణిమా. జ్యేష్ఠ. డోలారోహణ క్రయవిక్రయాదీనాం వృశ్చికోర సా.గం. 4-46.

21 శని. పాడ్యమి. మూల. అన్నప్రాశన, వివాహ, డోలారోహణ క్రయవిక్రయాదీనాం సింహోర ఉ.గం.11-17. పూ.షా. డోలారోహణస్య తులార సా.గం. 3-45.

22 ఆది. విదియ. ఉ.షా. ఆశ్వలాయనోపనయనస్య కర్కాటకోర ఉ.గం. 8-02. డోలారోహణస్య తులారాజా సా.గం. 3-41. వివాహస్య మేషోర రా.గం. 2-43.

23 సోమ. తదియ. ఉ.షా. అన్నప్రాశనోపనయన, అక్షరస్వీకార, క్రయవిక్రయాదీనాం సింహోమతాంర ఉ.గం. 11-8.

24 మంగళ. చవితి. ధనిష్ఠ. వివాహ గృహప్రవేశాదీనాం వృషభోర తె.గం. 4-8.

25 బుధ. పంచమి. శతభిషం డోలారోహణస్య తులారాజా ప.గం. 3-28. వివాహ గర్భాదానాదీనాం మకరోవసుః రా.గం. 9-7. వివాహస్య మేషోర రా.గం. 2-32.

27 శుక్ర. సప్తమి. ఉ.భా. కర్కాటకోర ఉ.గం. 7-41. వివాహ గర్భాదానాదీనాం మకరోర రా.గం. 8-59.

28 శని. నవమి. రేవతి. క్రయవిక్రయాదీనాం తులార ప.గం. 3-17.
వివాహ గర్భాదానాదీనాం మకరోమతాంర రా.గం. 8-56. వివాహ గృహప్రవేశాదీనాం వృషభోర శుభ నవాంశ కాలః రా.గం.3-10.

29 ఆది. దశమి. అశ్విని. అన్నప్రాశనోపనయన, అక్షరస్వీకార వివాహయాత్రాక్రయ విక్రయాదీనాం కర్కాటకోర ఉ.గం. 7-36. వివాహస్య మకరోరాజా రా.గం. 8-52. వివాహస్య మేషోర రా.గం. 2-17.

## ఆషాఢ మాసము (5-7-97 నుండి 3-8-97 వరకు)

జూలై 6 ఆది. విదియ. పుష్యమి. అన్నప్రాశనస్య కర్కాటకో ఉ.గం.7-07. డోలారోహణస్య తులార ప.గం. 2-46.

11 శుక్ర. సప్తమి. ఉత్తర. డోలారోహణస్య వృశ్చికోర ప.గం. 3-23, తులార ప..గం.2-25.

12 శని. అష్టమి. హస్త. డోలారోహణస్య వృశ్చికోర ప.గం. 3-18.

13 ఆది. అష్టమి. చిత్త. అన్నప్రాశనస్య కర్కాటకోర ఉ.గం. 6-38. డోలారోహణస్య వృశ్చికోర ప.గం. 3-16.

14 సోమ. నవమి. స్వాతి. అన్నప్రాశనస్య కర్కాటకోర ఉ.గం. 6-35. డోలారోహణస్య తులార ప.గం. 2-14.

జూలై 16 బుధ. ఏకాదశి. అనూ. అన్నప్రాశనస్య కర్కాటకోర ఉ.గం. 6-28. డోలారోహణస్య తులార ప.గం. 2-7. వృశ్చికోర ప.గం. 3-5.

18 శుక్ర. చతుర్దశి. మూల. డోలారోహణస్య ధనూర సా.గం. 6-8.

20 ఆది. పాడ్యమి. ఉ.షా. డోలారోహణస్య తులార ప.గం. 1-53. వృశ్చికోమతాంర ప.గం. 2-51.

23 బుధ. చవితి. శతభిషం. డోలారోహణస్య తులార ప.గం. 1-41.

24 గురు. పంచమి. ఉ.భా. డోలారోహణస్య ధనూర సా.గం. 5-46.

25 శుక్ర. షష్ఠి. రేవతి. డోలారోహణస్య ధనూర సా.గం. 5-40.

26 శని. సప్తమి. అశ్విని. తులారాజా ప.గం. 1-28. ధనుశ్చోరః సా.గం. 5-37.

29 మంగళ. ఏకాదశి. రోహిణి. వృశ్చికోమతాంర ప.గం. 2-14.

## శ్రావణ మాసము (4-8-97 నుండి 1-9-97 వరకు)

ఆగష్టు 6 బుధ శు.. తదియ ఉత్తర వివాహ గృహప్రవేశాదీనాం వృషభో ర రా.గం. 1-18.

7 గురు. చవితి. ఉత్తర. డోలారోహణ క్రయ విక్రయాదీనాం ధనూర సా.గం. 4-50. పంచమి హస్త వివాహస్య వృషభోవసుః రా.గం. 1-15. వివాహ గృహారంభాదీనాం మిథునంర రా.గం. 4-4.

8 శుక్ర. పంచమి. హస్త. డోలారోహణ క్రయ విక్రయాదీనాం ధనుశ్చోరః సా.గం. 4-52. చిత్త గృహారంభ ప్రవేశాదీనాం మిథునంర రా.గం. 3-59.

9 శని. షష్ఠి. చిత్త. డోలారోహణ క్రయ విక్రయాదీనాం ధనూర సా.గం. 4-40. గృహప్రవేశస్య వృషభోర రా.గం. 1-6. వివాహ గృహారంభాదీనాం మిథునం మతాంర రా.గం. 3-54.

10 ఆది. సప్తమి. స్వాతి. డోలారోహణ క్రయవిక్రయాదీనాం వృశ్చికో మతాంర ప.గం. 1-25,

12 మంగళ. దశమి. అనూరాధ. వివాహ గృహారంభ ప్రవేశాదీనాం మిథునంర తె.గం. 3-43.

14 గురు. ఏకాదశి. మూల. డోలారోహణ క్రయవిక్రయా దీనాం వృశ్చికోర ప.గం. 1-10. వివాహ గృహారంభాదీనాం మిథునంర తె.గం. 3-35.

16 శని. చతుర్దశి. ఉ.షా. వివాహ గృహప్రవేశాదీనాం వృషభోవసుః రా.గం. 12-39.

17 ఆది. పూర్ణిమా. శ్రవణం. వివాహస్య గృహారంభాదీనాం కర్కాటకోర తె.గం. 4-24.

18 సోమ. పాడ్యమి. ధనిష్ఠ. డోలారోహణ క్రయవిక్రయాదీనాం మకరోర సా.గం. 5-34.

20 బుధ. తదియ. ఉ.భా. వివాహ గృహప్రవేశాదీనాం వృషభోవసుః రా.గం. 12-23.

21 గురు. చవితి. ఉ.భా. డోలారోహణ క్రయవిక్రయాదీనాం వృశ్చికోర ప.గం. 12-41. మకరోర సా.గం. 5-23. రేవతి వివాహ గృహారంభాదీనాం కర్కాటకోర తె.గం. 4-10

22 శుక్ర. పంచమి. రేవతి. డోలారోహణ క్రయవిక్రయాదీనాం మకరోర సా.గం. 5-18. అశ్విని కర్కాటకోవసుః తె.గం. 4-07.

25 సోమ. అష్టమి. రోహిణి. గృహప్రవేశస్య వృషభోర రా.గం. 12-02

## భాద్రపద మాసము (2-9-97 నుండి 1-10-97 వరకు)

సెప్టెంబరు 3 బుధ. శు.ద్వితీయ. ఉత్తర. డోలారోహణస్య ధనూర ప.గం. 3-0.

5 శుక్ర. తదియ. చిత్త. ధనుర్మతాంర ప.గం. 2-50

6 శని. చవితి. స్వాతి. డోలారోహణస్య వృశ్చికోర ప.గం. 11-36, ధనూర ప.గం. 2-47.

11 గురు. నవమి. మూల. డోలారోహణస్య వృశ్చికోర ప.గం. 11-16.

12 శుక్ర. దశమి. ఉ.షా. డోలారోహణస్య మకరోమతాంర ప.గం. 3-53.

13 శని. ఏకాదశి. ఉ.షా. అన్నప్రాశన డోలారోహణస్య వృశ్చికోర ప.గం. 11-9.

## ఆశ్వయుజ మాసము (2-10-97 నుండి 31-10-97 వరకు)

అక్టోబర్ 3 శుక్ర. విదియ. చిత్త డోలారోహణస్య క్రయవిక్రయాదీనాం మకరోర ప.గం. 2-30. స్వాతి మేష రా.గం. 7-33.

4 ఆది. తదియ. స్వాతి. అన్నప్రాశన నూతన వ్యాపారాదీనాం తులార ఉ.గం. 8-46. డోలారోహణ క్రయ విక్రయాదీనాం ధనూర ప.గం. 12-55.

8 బుధ. సప్తమి. మూల. డోలారోహణ క్రయవిక్రయాదీనాం వివాహస్య మేషోమతాంర రా.గం. 7-36 మకరోర ప.గం. 2-08.

10 శుక్ర. నవమి. ఉ.షా. డోలారోహణ క్రయవిక్రయ నూతనవస్త్ర ప్రారంభాదీనాం ధనూర శుభనవాంశకాలః ప.గం. 11-07.

11 శని. దశమి. శ్రవణం. డోలారోహణ నూతనవస్త్ర వ్యాపారాదీనాం ధనూర ప.గం. 12-25. విజయముహూర్త కాలః ప.గం. 2-07. వివాహస్య మేషారాజా రా.గం. 7-24.

12 ఆది. ఏకాదశి. ధనిష్ఠ. అన్నప్రాశనస్య తులాచోరః ఉ.గం. 8-14. డోలారోహణ క్రయవిక్రయాదీనాం మకరోర ప.గం. 1-53. శతభిషం వివాహస్య మిథునమపి మతాంర రా.గం. 11-37.

13 సోమ. ద్వాదశి. శతభిషం. మకరోర ప.గం. 1-47.

15 బుధ. చతుర్దశి. ఉ.భా. అన్నప్రాశనస్య తులాచోరః ఉ.గం. 8-02. వివాహస్య మిథునంరాజా రా.గం. 11-25.

16 గురు. పూర్ణిమ. రేవతి. ధనూర ఉ.గం. 12-8, అశ్విని వివాహ నిషేకాదీనాం మేషోమతాంర రా.గం. 7-05.

19 ఆది. చవితి. రోహిణి. వివాహ అన్నప్రాశన క్రయవిక్రయాదీనాం ధనూర ఉ.గం. 11-54 వివాహ గర్భాదానాదీనాం మిథునం ర రా.గం. 11-09.

20 సోమ. పంచమి. మృగశిర. నూతన వ్యాపారాదీనాం ధనూర ఉ.గం. 11-50 (ఓ చంద్రః), ఆర్ద్ర గర్భాధానస్య మిథునం మతాంర రా.గం. 11-05, పుష్యమి కర్కాటకోర రా.గం. 11-50.

25 శని. దశమి. మఘ. వివాహస్య మిథునమపిర రా.గం. 10-44, కర్కాటకోరాజా రా.గం. 11-42.

26 ఆది. ఏకాదశి. మఘ. ధనూరాజా ప.గం. 11-26.

